

# లవ[illegible]తీపరిణయము




గ్రంథకర్త :

యస్. జాషువ, బి. ఏ., బి. ఇడి.

సెంట్ హైస్కూల్, జోగిపేట, మెదక్ జిల్లా.




.

# ప రి చ య ము

## కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

శ్రీ ఎ. ఎస్. జాషువ రచియించిన శీలమతీపరిణయము అను ఖండకృతిని ముద్రణకు పూర్వమే చూచునవకాశము నాకు లభించినది. బైబిల్ గ్రంథములోనియొకకథను ఆధారముగాఁగొని శ్రీజాషువ యీకావ్య నిర్మాణమునకుఁ బూనుకొని కృతకృత్యులైనారనుటలో సంశయము లేదు. బైబిల్ గ్రంథములోనియిట్టినీతిదాయకములైనకథలను జనసామాన్యమునకు అందఁ జేయుట యెంతేని అవసరము. ప్రతిభావంతుఁడైన శ్రీజాషువ నిర్దుష్టమైనభాషలో ఈకవితను సాగించి యాంధ్రలోకము యొక్క మన్ననకుఁ బాత్రులైరి.

అన్నిమతములకు మూలస్తంభములైనసత్య,దయా,శౌచములు, నీతి, ధర్మములను ఆధారముగాఁ జేసికొని రచియింపఁబడిన యీగ్రంథము క్రైస్తవసోదరులకే కాక ఆంధ్రప్రజలకందఱకుఁగూడఁ బఠనీయముగా నున్నది. భవిష్యత్తులో ఉత్తమకావ్యములు రచింపఁ గలుగుటకుఁ దగిన కవితాబీజములు వీరియందుఁ గలవని యీకావ్యపఠనముచే నాకు గోచరించినది. శ్రీజాషువ యిట్టివే బైబిలులోని మఱికొన్ని సాంఘిక, ధార్మిక, నైతిక, అధ్యాత్మికకథలను జనసామాన్యమునకుఁ బఠనీయములుగా నుండునట్లు రచించి యాంధ్రప్రజల కృతజ్ఞతకుఁ బాత్రులగుదురు మని భగవంతునిఁ బ్రార్థించుచున్నాను.

# సందేశము

డాక్టర్ ఈ. ప్రకాశము
కార్యదర్శి, సత్యవేద సంఘము
బైబిల్ సొసైటీ, ఇండియా
మరియు సింహళము

కింగ్స్వే, సికిందరాబాద్
దక్కన్
1-5-1961

శ్రీ ఏ. యస్. జాషువగారు వ్రాసినశీలమతీపరిణయ మనుపద్య కావ్యమును సాంతముగఁ జదివితిని రచయిత యిందుఁ గనఁబఱచిన పాండిత్యమునకై వారి నభినందించుచున్నాను. నేను కవిని కాకుండినను నాకుఁ గావ్యము లన్నఁ గడుఁ బ్రీతి. క్రైస్తవరచయితలలోఁ గవుల సంఖ్య చాల స్వల్పము. జాషువగారికృషిని దేవుఁ డాశీర్వదించి ఆంధ్ర క్రైస్తవవాఙ్మయమునం దున్నకొఱతను దీర్చునట్లు పరమాత్ముఁడు వీరికిఁ దగుప్రోత్సాహము ననుగ్రహించుఁ గాక యని ప్రార్థించు చున్నాను.

# ప్రశంస

హైదరాబాద్          రెవ. ఏ. బి. మాసిలామణి
మే 2, 1961          వాఙ్మయ కార్యవర్గము
ఆంధ్రక్రైస్తవసభ.

శ్రీ ఏ. యస్. జాషువ విరచితమైన "శీలమతీపరిణయము" అను కావ్యగ్రంథమును నేను ఆమూలాగ్రముగా జదివితిని. బైబిలుసాంప్రదాయములకు జెంది, నాటిచారిత్రకసాంస్కృతికకళలతో నలరారుచు, నవ్యభారతీయమనశ్చైతన్యమును బ్రతిబింబింపజేయుచు, దేశీయభావములతో నలరారునట్లుగాను ఈ కావ్యము సృష్టింపబడినది. ఇందలి సున్నితములైన ప్రణయసంవాదములు, లలితశృంగారవర్ణనలు, కవితాచమత్కారము మన ప్రాచీనకవులను దలపించుచు ఈకథకు జీవకళలుగా నున్నవి. క్రైస్తవులలో నిట్టియుత్తమకవి యున్నందులకు సంతసించుచు వీరిభావిరచనలు ఆంధ్రసాహిత్యమునకు క్రైస్తవులకును కానుకలై క్రైస్తవసంఘములకు సాహిత్యార్చనలై శ్రీ యేసుదేవునికి భారతీయుల జోహారులై వర్థిల్లుగాక యని ప్రార్థించుచున్నాను.

ఆంధ్రక్రైస్తవులకు "తెలుగురాదు" అను నొకఅపనిందను పారదోలుట కిట్టిగ్రంథములు వజ్రాయుధములు.

భాషారాధకులగు మనకవులను భాషాపోషకులు సత్కరించి, వారిగ్రంథములను విరివిగా బఠించి, వారిసేవ క్రైస్తవ, సంఘమునకు, ఆంధ్రభాషకు అమూల్యమైనదిగ నొనర్చి మనప్రతిపత్తిని పెంపొందింపజూనుట మనగురువులయొక్కయు, నాయకులయొక్కయు ముఖ్యకర్తవ్యమని భావించుచున్నాను.

# కవి ప్రశంస

బి. ఎస్. జార్జి

హైదరాబాదు
1-5-61

శా॥ నీకావ్యంబును జూచినాఁడ మదికిన్ నిర్వాచ్య హర్షావళుల్
జేకూరెన్, భవదీయ శీలమతి సౌశీల్యంబు, సాలాధిపా
స్తోకజ్ఞాన వివేక శౌర్యపటిమల్ జూడంగ, నవ్వారి దౌ
శ్రీ కల్యాణ మహోత్సవంబు గనుటన్ శ్రీ జాషువా సత్కవీ ।

తే. గీ. ఆంధ్రక్రైస్తవ వాఙ్మయ హర్మ్యమందు
కావ్యకన్యాలలామంబు గలుఁగదన్న
వింద దొలఁగెను నేటితో నీదు శీల
మతి ప్రవేశింప జాషువా మాననీయ ।

చ. గురు ప్రతిభా ప్రదీప్తులగు గుఱ్ఱము జాషువయున్ ప్రసిద్ధ చౌ
దరి పురుషోత్త సూర్యులు మొదల్గల క్రైస్తవసత్కవీంద్రులం
గొరఁగాని కీర్తికాంత నిను గోరి వరించెను, క్రైస్తవ ప్రబం
ధ రచన కార్యకర్తవయి ధన్యుడవైతివి జాషువా కవీ ;

తే. గీ. నీ కథావస్తువది మహా నిర్మలంబు
సర్వ లోకైక జ్ఞానియౌ సాలమోను
తా రచించిన 'పరమగీతా' ప్రసిద్ధ
భావసవలా ప్రబంధ సంబంధమగుట.

తే. గీ. సప్తసాగర మధ్యదేశస్థ దివ్య
రత్నరాజంబు హరియించి రక్తిమై బ్ర
పంచములకుం బ్రదర్శింపనెంచినావు
ఆహా ! నీయత్న మొక మహాసాహసంబు.

శా. షాలేముప్రభు కావ్యనాయికను బ్రాంచద్భావ చిన్మూర్తి నా
షూలమ్మీతిని దీసి శీలమతిగా జూపించి, సత్పాదకా
శాలూకమ్ముల నీతిచంద్రికల హర్షప్రాప్తలంజేసి నా
వాలేట్యంశ సుధాబ్ధిపూర్ణిమనుగ్లవీహై జూపువా సత్కవీ !

క. శ్రీ కాసీనుఁడు వాక్య
ప్రాకటనాముండు భక్తపాలుఁడు యేస
స్తోకానుగ్రహ పూర్ణత
నీ కావ్యకుమారి మరియు నిజ బ్రోచెడుత౯.



# వి జ్ఞ ప్తి

పాలస్తీనాను బరిపాలించినయూదరాజులలో నగ్రగణ్యుఁడగు సాలమోనుచక్రవర్తి జ్ఞానమునకును న్యాయపరిపాలనకును బేరు గడించెను. సాలమోనురాజు బాల్యమునందు జరిగినఘట్ట మిందు వర్ణితము. అతఁడు బాలుఁడై తనతండ్రి దావీద్‌చక్రవర్తి యొక్క పసులమందలను గాచుటకు నొకనాఁ డొకయరణ్యమున కేగి యం దొకరైతుబాలికను శీలమతి యనుదానినిఁ జూచి ప్రేమించెను. అతఁడు రాజైనతరువాత శీలమతిని రాణిఁగా స్వీకరించినవిషయ మీకావ్యమందలియితివృత్తము. శీలమతీ పరిణయ మాంధ్రులయాదరభావము నొందఁ గల్గిన నే నెంతయు ధన్యుఁడను.

ఆంధ్రలోకంబున విఖ్యాతి నొందినసంస్కృతాంధ్ర పండితోత్తములు, ఉదారహృదయులు, మహాకవులు, ఆంధ్రబిల్హణ, బ్రాహ్మీభాషణేత్యాది బిరుదాంచితులు నగు శిరోమణి శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రులుగారు నాయం దత్యంతవాత్సల్యముఁ జూపి యీగ్రంథమును మిగుల నోపికతో రాత్రి యనక పగ లనక కష్టపడి సంపూర్ణముగ సవరించి దానికిఁ దగురూపము నొసఁగి పరిచయవాక్యములు రచియించి నన్ను అనుగ్రహించిరి. శ్రీ శాస్త్రులుగారికి నాజీవితాంతము ఋణపడి యున్నాను. వారిమేలు మరవఁ జాలను. వారికి నాకృతజ్ఞతాపూర్వక వందనములు హృదయపూర్వకముగా సమర్పించు చున్నాను.

“శీలమతీ పరిణయము”ను రచించుటకు నన్ను బ్రోత్సహించిన నల్లగొండ డిప్యూటీ జిల్లా విద్యాశాఖాధికారియు మదీయమిత్రులునగు శ్రీ వి. నాగభూషణరావు, బి. ఏ., బి.ఇడి.గారికి నా కృతజ్ఞతలు.

ఈగ్రంథము ఇంతనిర్దుష్టముగఁ బ్రచురింపఁ బడుటకు ముఖ్యకారకు లైనమిత్రులు శ్రీ పి. బి. జేమ్సుగారికి నే నెంతయు గృతజ్ఞుఁడను.

ఈ గ్రంథప్రచురణలో నన్ను బ్రోత్సహించి శుభాకాంక్ష లిచ్చిన శ్రీ కొత్తపల్లి జాషువ కవికి నాకృతజ్ఞతలు.

ఈ గ్రంథమును దిలకించి నన్నాశీర్వదించి శుభసందేశ మొసఁగిన పూజ్యులు డాక్టర్ ఈ.ప్రకాశముగారికిని. క్రైస్తవసాహిత్యసంస్థకు అధ్యక్షులగు రెవరెండ్ ఏ. బి. మాసిలామణి ఎం. ఏ., బి. టి. హెచ్‌గా. రికిని నాహృదయపూర్వకకృతజ్ఞతల నర్పించు చున్నాను.

శుభాకాంక్షలతోను బ్రశంసలతోను నన్ను బరిచయముఁ జేసిన తెలుఁగుపండితులు, సాహిత్యవిద్యాప్రవీణ శ్రీ దోర్భల వెంకటరాజశర్మ గారికి, శ్రీ యం. రంగాకృష్ణమాచార్యులు బి. ఓ. యల్, గారికి. శ్రీ బి. జార్జికవిగారికి. శ్రీ బి ఏ. డేవిడ్‌గారికిని నే నెంతయుఁ గృతజ్ఞుడను,

మదీయోద్యమమును జయప్రదముగాఁ గొనసాగించుటకుఁ బ్రోత్సహించిన మిత్రులు తెలుఁగుపండితులు భువనగిరివాస్తవ్యులైన శ్రీ టి. పాండురంగంగారు, శివన్నగూడెం నివాసులు కీ. శే. శ్రీ బి. సుదర్శనముగారు, హైద్రాబాద్ నివాసులు శ్రీ నిత్యానందముగారు, జోగిపేట వాస్తవ్యులు శ్రీ సంగమేశ్వర సంగంగారు నిరంతరము నాకు శ్లాఘనీయులు.

ఈ గ్రంథమును ముద్రించుటలోఁ బ్రత్యేకశ్రద్ధ వహించిన శ్రీ వాణీముద్రణాలయమువారికి నాకృతజ్ఞతను దెలుపు చున్నాను.

గ్రంథకర్త

గమనిక;-ఈగ్రంథములోని పాత్రలకు మూలములోనిపేర్లకు ఈ క్రింది నామములు మార్చి వాడనైనది.

| మూ॥ | మార్పు |
|---|---|
| సాలమూ౯ | సాలరాజు |
| దావీదురాజు | జైత్రుడు |
| అదోనియా | పారీంద్రుఁడు |
| సౌలురాజు | సామపాలుఁడు |

## ఆశీస్సులు :

—శ్రీ కొత్తపల్లి జాషువ-కవి

ఉ. సకల సుఖంబులుండి ప్రభు-సాదరముండి రచించినారు, పు
స్తకముల నాదిలో గవులు-ధాత్రి దరిద్రత మున్గిదేలుచుం
డౌక బడి పంతులయ్యు రచ-నోద్యమముఁ గని సంతసించెదఁ
సకల శుభంబు నీకగుత—సజ్జన! ఏ-యసు, జాషువా! కవీ!

తే. గీ. దేశభాషలలోపలఁ-దెలుగు లెస్స
సకల జాతులలో యూద-జాతి లెస్స
రెంటికిని జంటజేయ-మీ-వంటివారు
బంగరుకు దావిగూర్చిన-పగిది జాష్వ!

చ. మొదటి ప్రయత్నమే యయిన-మోదముగూర్చును పాఠకాళికిన్
పదములు ద్రాక్షపాకమున-వర్ణనలుఁ రసపూరితంబుగాఁ
సదయత నాంధ్రలోకమున-స్థానముబొందితి ధన్యుడౌ సదా
ఇదియొక యడ్గుపూనుట, య-నేకము వ్రాయగ జాషువా! కవీ!

శ్రీ రంగనాథ సరస్వతీసదనము
అందోలు.
15-8-60

# ప్రశంస

ఎం. రంగకృష్ణమాచార్యులు
B. O. L

1

జాషువ నామమందుగల-శక్తి యదెట్టిదొగాని జూడగా
జాషువ నామధేయకులు-సర్వులు పండితపుంగవుల్ గదా
జోషుగ కావ్యరాజముల-సొంపొలయంగ రచించినారు, ఓ
జాషువ ! నీదు "శీలమతి" చాటెను నిక్కమటంచు తెల్పగన్.

2

సాహితీ భక్తుడవు నీవు-సహృదయుడవు
తెలుఁగు యింగ్లీషు భాషలు-తేటనీకు
ఉభయభాషలయందున-నొప్పిదముగ
పండితులు మెచ్చ కావ్యముల్-వ్రాసితివీవు.

3

తరచిచూడగ నీ కవితాపటుత్వ
మింతయని నుతింపగజాల విది నిజంబు
సరసపదముల నొప్పారి సరసమయ్యె
కావ్యజీవనుడవుగాన కావ్యమయ్యె.

4

శీలమతి పరిణయ మతి చేవగల్గి
సులలిత సదలంకార సుశోభిత పద
జాల బంధుర కావ్యమై సహృదయాళి
మన్ననల నొందుగావుత చెన్నుమీర.

5

జోగినాథ పురంబునందు కవితా-జ్యోతుల్ ప్రకాశింపగా
సాగెన్ కావ్యరసజ్ఞ బాంధవులు మె-చ్చన్ నవ్యసాహిత్య సౌ
భాగ్యం బేర్పడ హృద్యమై తనరగా,పద్యావళుల్ గూర్చితౌ
శ్రీ గీర్వాణనుతుండు గూర్చుత సదా శ్రేయంబులన్ జాషువా !

# శుభాకాంక్షలు

నా మిత్రులు, సహోపాధ్యాయులు శ్రీ ఏ. యస్. జాషువ రచించిన "శీలమతి పరిణయము" అను గ్రంథమును స్థాలీపులాక న్యాయముగ పరిశీలించితిని. ఇది యూదుల చరిత్రను సంగ్రహముగ దెలుపు ఉత్తమ గ్రంథము. ఇందలి ఇతివృత్తము విదేశీయమైనను స్వదేశభాషలో చక్కగ సరసముగ పద్యకావ్యముగ రచింపబడినది.

కావ్యములోని యుద్యానవన యుద్ధాది వర్ణనములు, శీలమతి సాలమోనుల సరససల్లాప సన్నివేశములు కవికిగల సాహిత్యసంపదకు, లోకానుభవమునకు, పాండిత్య ప్రకర్షకు ప్రముఖ నిదర్శనములు. శైలి భావగాంభీర్యమై, సరళమై, మృదుమధుర మంజులపద శోభితమై, ఇంపు సొంపులతో నెంతయు నొప్పుచున్నది.

ముద్దుల మూటగట్టునట్లు పలుకులొలుకు ఉత్తమపుత్తము చదువరులకు సంతసము సమకూర్చుననుటలో నావంత వింతలేదు. "కావ్యం యశసే" అన్నట్లు కవికి ఖ్యాతిగూర్చు నీ కావ్యము కలకాల మాంధ్రుల కరకమలము లందు విరాజిల్లుగాకయని ఆశించుచున్నాను.

జోగిపేట
20-8-'60

సాహిత్య విద్యాప్రవీణ
దోర్బల వేంకటరాజశర్మ
తెలుగు పండితులు

# తప్పొప్పులు

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| పీఠిక | 5 | 1 | జోగి | జోగీ |
| 4 | 15 | 4 | ై | త్రై |
| 7 | 32 | 4 | ష | ష్ట |
| 22 | 13 | 2 | ముడిచిరి | ముడిచి |
| 42 | 64 | 4 | ధు | థు |
| 53 | 53 | 2 | ద | దీ |
| 56 | 74 | 1 | రాజ్ఞాను | రాజ్ఞాజ్ఞను |
| 57 | 77 | 2 | టు | ట్టు |

# శీలమతీపరిణయము

## ప్రథమాశ్వాసము

**ఇష్టదేవతాస్తుతి :**

శా. శ్రీకల్యాణగుణాఢ్యకన్య "మరియా" చిన్నారిపుత్త్రుఁడు, హృ
ద్వైకల్యంబును బాపుఱేఁడు ఘనపాపవ్రాతదూరుండు, వి
శ్వాకారుండు, త్రిలోకరోగభిషజుం డై మృత్యువుఁ బాపుత్రై
లోకారాధ్యుఁడు క్రీస్తు నన్ను, కృతి నాలోకించుతన్ బ్రేమతో. 1

ఉ. "పొంతి పిలాతు" హంతకులపొందు గడించి నయంబుఁ దప్పి, య
త్యంతదురంతమారణపుదండనఁ దెల్పఁగ భార్య దాని క
భ్యంతరమున్ వచించి ఘనపావను యేసును వీడు మంచుఁ దాఁ
గాంతుని నాఁపఁ బూనెను, జగంబునఁ గొల్చెద యేసుదైవమా! 2

కం. నీమృత్యువునన్ జగమునఁ
బ్రామినయుత్పాతములకు భయపడి యంతన్
"రోములు" దాచిరి శవమును
నీమహిమను దెలియ లేక నీచులు యేసూ! 3

మ. నిను గ్రూరంబుగ యూదు లాసిలువపై నిర్బంధితున్ జేసి, హే
ళనగా యూదులరాజ వంచు నిను గీలాలంబు పారంగఁ గొ
ట్టినయామానవులన్ క్షమింపు మనునీడెందంబు సామాన్యమే
ఘనపాపంబులఁ బాపు నీ కిదె నమస్కారంబు ఏసుప్రభూ! 4

## సుకవిస్తుతి :

ఉ. భక్తిని నాంధ్రసత్కవులవర్గము నెంతయు సంస్తుతించి వా
గ్భుక్తుల సంస్కృతీయకవికోవిదసంఘము సన్నుతించి ధీ
యుక్తుల గేయకర్తలను నుత్తమరీతిఁ దలంచి యంత ను
ద్యుక్తుఁడ నైతి "శీలమతి యుద్వహనం"బను కావ్యనిర్మితిన్. 5

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు, సుకవి స్తుతిఁ గావించి. 6

## గ్రంథారంభమునకుఁ గారణము :

చ. చదువులమర్మమున్ దెలిసి సారము వెల్లడి సేయుసూరి నా
హృదయ మెఱుంగుమిత్రుఁడు మహీసురవంశ్యుఁడు నాగభూ
షణా
ఖ్యుఁ దనరు ధీరుఁ డంత నను గావ్యము యూద నృపేంద్రువర్ణనన్
సదయతఁగూర్పు మన్న నిటు సాగితి వ్రాయఁగ ఖండకావ్యమున్ 7

కం. శీలమతీపరిణయమును
బాలురు పఠియించి బుద్ధిఁ బడయుటకై నే
నాలోచనఁ గొని వ్రాసితి;
ధీలోలురకంఠహారతేజముఁ గనుతన్ ! 8

## స్వవిషయము :

చ. గగనము నంటుసప్తకనగంబులు చుట్టును మించుసౌధముల్,
పగతురభీతి కారు లయి బా గగుకోటలు, పద్మనాయకుల్
తెగువన నేలినట్టి దగు "దేవరకొండ" పురంబు నాకు నీ
జగతిని జన్మదేశ మయి శైశవ విద్యల నేర్పె నాటలన్. 9

ఉ. ఆరయ మాతృభాష ప్రియ మారఁగ నేర్పెడుబోధకుండ, నే
భారతక్రైస్తవుండ జనవందితు "లేలియ శాంతమాంబలున్"
గూరిమితల్లిదండ్రు, లల కొల్తును యేసును మద్గురూత్తమున్,
బేరున "జాషువా"యని భువిన్ నను బిల్తురు మిత్రవర్గముల్. 10

కం. యూదపురాణపుమూలము
నాదటఁ గైకొని సుకావ్యయత్నంబునకున్
వాదోడు లేక సాగితి
నీదయకున్ బాత్ర మగుచు నిత్యము యేసూ ! 11

## కథా ప్రారంభము

ఉ. భూనభముల్ జగంబులును బుట్టిననాఁడు ఖసూచిసూర్యసం
తానము శైశవంబు నట దాటనినాఁడు, దురాత్మ పాపి, సై
తానుడు లేనినాఁడు, మతధర్మభయంబులు లేనినాఁడు, "ఏ
దేను" విహారభూమి యయి దేవునితో నరజాతిఁ గూర్చెడున్. 12

మ. తొలి నాకాశనివాసులున్ ధరకు సందోహంబులై వచ్చి రం
జిల నేదేనువనంబులో ముదముతో జీవించు చుండంగ ని
ర్మలరత్నాకరనిమ్నగావళిని భూమధ్యంబునన్ నిల్పి లో
కులునున్ మధ్యధరాసముద్ర మనుచున్ ఘోషింపఁగన్ దానినిన్.

చ. పావనకన్య భూమి యెదపైఁ గుచకుంభము లుబ్బి వానిలో
జీవజలంబు పుట్టి యది చీలికలై నదు లయ్యె, "హిద్దికల్
హోవిల, పీషనా, గిహాను" అద్భుత మైన "ఫరాతు, టైగ్రసుల్"
ఆవనమేదినిన్ దడిపి యందలిజీవులఁ గాచు చుండెడున్! 14

సీ. ఏభూతధాత్రికై "ఈజిప్టు" రాజులు
చెలరేగి యుద్ధముల్ సేసినారొ;
ఏపృథ్విఁ గైకొని యేల సంకల్పించి
"బబులోను" రాజులు భంగపడిరొ;
ఏభూమిఁ బొందంగ నేఁటేఁట యుద్ధముల్
పారశీకులు పోరి పాఱినారొ;
ఏసీమ గ్రీసు నేలెడురాజులు
దండయాత్రలు సల్పి దగ్ధులైరొ;

తే. యట్టి "కానాను" దేశమే యఖిలభోగ
భాగ్యసత్కళలకును నారోగ్యమునకు
రాజకీయములకు మంచి రాజ్యమునకు
సంశ్రయం బయ్యె భూతలస్వర్గ మనఁగ. 15

వ. మఱియు నాదేశంబున నుత్తరదిశ నున్న "సిరియా" యెడారి యత్యుష్ణపవనంబుల నాపుటకై కల్పితప్రాకారంబులా యను నటుల "లెబనోను, హెర్మోను" పర్వతంబులు నిరంతరంబు హిమమయములై నిర్ఝరధారల కునికిపట్టులై ఫలభరిత వృక్షములతో నొప్పి "పాలస్తీనాను" వేఱు సేయు. 16

ఉ. ఉత్తరశైలకూటమున కుజ్జ్వల "యోర్దను" పేర నేరు ద
క్కొత్తెడునేలఁ బుట్టి ముడికొండలమండలమున్ జరించి, తా
ముత్తెపుబారుతీరునను భూమికిఁ బాఱఁగఁ దీరభూములున్
ఒత్తికొనంగ నందుఁ బలునుర్విజముల్ గహనంబుగాఁ దగన్. 17

వ. మఱియు నాదేశములోనిసాంద్రారణ్యములందు 18

మ. కడితుల్ గాడ్దులు నుష్ట్రిభాగహారిణుల్ కాకోలకాదంబముల్
బుడకోళ్లున్ మఱి నక్కలున్ శిఖివృకంబుల్ సంచరింపంగ న
క్కడ రంభావకుళాల్ తమాలములునున్ కాకాంగకామంజికల్
మడుగుల్ తామర కేతకీకుముదముల్ మాకందహింతాళముల్.19

చ. ఉదధితరంగనున్నజల ముద్రృమియింపఁగ వాయువుల్ సదా
పదపడి తీరభూములకుఁ బాయక గుప్పఁగ నార్ద్రి మయ్యె నా
ముదిరము దూరభూములకు మోయఁగ నీరు ఫలించెఁ జౌడులున్
ముదమున"పాలషితు" పర మోక్షము నై ధరఁ గానుపించఁగాన్.20

ఉ. ద్రాక్షగుళుచ్ఛముల్ మధురదాడిమరంభలు నాగరంగముల్
కాఱిగవాక్షులుః పికచకైరవిణుల్ మొద లైనవృక్షముల్
లాక్షసుచందనాదిన్మృదులాజము లాదిలతాళిశోభలున్
ప్రేక్షణపర్వముల్ దెసలఁ; జేర్కొన శక్యమె దేశశోభలన్. 21

వ. సకలధాన్యములు గొట్లు నిండఁగఁ గర్షకవర్గంబును, అనేక గోధన
ము/లను గలిగిన గోపాలకులను, బహువిధవాణిజ్యంబులతో నొప్పు
సేహారులను గల్గి యాదేశంబు స్వర్గతుల్యం బై నిత్యకల్యాణముతో
నొప్పుచుండె నంత. 22

ఉ. క్ష్మాపతి సామపాలుఁ డట కామిత షాలెమరాజ్యలక్ష్మిఁ దా
నాపదపాలు సేసి యభియాతికిఁ జిక్కిననాఁడు, జాతి సం
క్షేపమునొందునాఁడు, రణకేంద్రముఁజొచ్చి యరాతిఁగూల్చి,యా
భూపతికల్లుఁడైన"జెసి"పుత్త్రిడు "జైత్రుఁడు"రాజ్య మొందఁగన్.

వ. అసాధారణమేధావి, ధీరుండు, కవిచంద్రసంస్తుతకీర్తిసాంద్రుం
డు, సమ్మానితశీలుండును నగునాక్షైత్రుండు రాజ్యంబు పరి
పాలించునంత. 24

క. ప్రాభృతశుల్కములను గొన
నేభృతిజీవియును లేఁడు, పలిక పేరన్
బ్రాభృత్యుస్పృహ్యత్తు చతురత
తో భృత్యుల నుద్ధరించి తోడ్పడు చుండెన్. 25

వ. ఆభూపాలునకు.

క. "హాగ్గీత, ఎగ్గ, బత్సెబ"
ముగ్గురు ప్రియసతులెకాక మోహిని "మయకా"
సిగ్గరి "సబీట" విచ్చిన
మొగ్గలవలె గానిపింత్రు ముసిముసినగులన్. 27

క. వారికిఁ గల్గిరి పుత్త్రిలు
"పారీంద్ర, సమీరసాల, జాలమతుండున్"
ధీరత "లోహలుఁ"డిఁక "నుప
చారుఁడు" కర్ణేందురాజు, సప్తతనయులున్. 28

వ. జైత్రభూపాలుండు తనతనయులను మండలాధికారులుగను, వ్యవ
హారపర్యాలోచనకర్తలుగను నియమింపఁ గనిష్ఠుఁడు సాలరాజు
మందకాపరుల కధిపతి యయ్యెను. 29

వ. సాలరాజు. 30

చ. అతులితఁయూదవేదముల నన్నిటి నేర్చినసాలభూపుఁ డా
తతమృగపక్షికీటకవితానసుమిత్రుఁడు, వానిభాషలన్
జతురతతోడ నేర్చె నరభాషలతోడుతఁ జాలఁ బ్రీతి; భూ
పతి కతియిష్టుఁడయ్యెఁ దనబంధువులన్ మురిపించు నెప్పుడున్. 31

చ. అతఁడు ప్రగల్భుఁడై కడు దయాళుఁడు నై యతిశాంతిమూర్తియై
కతిపయజంతుపాలకులకర్త పరాక్రమశాలి నిత్యమున్
హితహితకారి యాశ్రితసుహృన్నివహుండు నుదారభావుఁడున్
బ్రతిభ విశాలభావముల భాగ్యము లొందెఁ గనిషపుత్త్రిఁడై. 32

వ. అతఁ డొకవర్షర్తుదివసంబునఁ దనమందలనుఁ జూచుట కరణ్యంబు
నకుఁ జేరునంతఁ బ్రతీచివాయువులు హాయిగ వీవ మయూర
నాట్యములు కన్నులవిం దొనర్పఁ గురంగములు చెంగున గంతు
లిడఁగా మనోజ్ఞమైన యరణ్యచ్ఛవి వింతగొల్పుచుండు నత్తటి
నమ్మహారణ్యంబునందుఁ బుట్టిన పరివేల్ల, త్రిసంగ, శశశృంగ,
కిక్కిస, కామంజిక, జవస, శతపర్వికాదితృణజాతులు విస్తరిల్ల
వాని నాగోవులు పుష్కలంబుగా మేసి యొకచోట విడిసి యుండ
రాకొమరుం డరణ్యములోఁ దిరుగు చుండె నంత. 33

చ. సిరియ, నిపూరు లాదిమరుసీమలఁ దూరుక్రమేళకంబులున్
ఖరకరురశ్మిసంతతికిఁ గాహళభూముల విస్తరించి, వే
గిరమునఁ బారునుష్ట్రితతికిన్ సము మైనవలాహకంబులం
దుటిమెను జంచలావ్రతతు లుజ్జ్వలరీతినిఁ దూల మింటిపై. 34

చ. ప్రసవదినంబు వచ్చె నని భ్రాంతిని సాగరుభార్య వారిదం
బెస గొని వాయువాహనము నెక్కి నభఃపథమున్ జనంగఁ దా

మసలెడుమానసంబు మఱి మాననిభర్తృవియోగతాపముల్
కసిమసికంటినీరు వడగం డ్లయి రాలెను భూతలంబునన్. 34

ఉ. గర్భములోనిపిండ మిఁక గంతులు వేయుట మానె; వేదనన్
దుర్భర మయ్యె దుఃఖము; నధోగతి యెట్లు తొలంగు నంచుఁ దా
గర్భవతీవలాహకము కంఠము నెత్తి భయంకరంబుగా
నార్భటనంబుఁ జేయ నుఱు మయ్యెను భూములు దల్లడిల్లఁగాన్ 35

వ. అట్లు వర్షర్తువు గూర్చు వినోదముల కెంతయు సంతసిల్లి
యందంచుఁ గ్రుమ్మరుచు "తాబోరు" పర్వతంబును సమీపించునంత.

ఉ. 'తాబరు' పుణ్యపర్వతము హాపునఁ జెన్నగుతోఁట లెన్నియో
'జాబెలు' మింటితోఁట లయి పర్వతమున్ విలసిల్లఁ జేయు, 'కా
లేబు,' వనంబునందు గుణలీల కుతూహలభవ్యశీలయున్
జాబిలిఁ బోలి దిక్కులకు సాగఁగఁ జేసెను మేనిజ్యోత్స్నలన్. 37

కం. బలురక్కసిమిసిపొదలోఁ
జలియించెడువల్లిపద్మసతికిన్ సమ యై
కలకంఠి శిలల మధ్యను
గులుకుచుఁ బోవంగఁ దోఁచెఁ గుసమంబో యనఁగా, 38

కం. దివినుండు చంద్రబింబమె
భువికిన్ వచ్చె ననఁ దోఁచుపొలతుకవదనం
బవలోకించినవానికి
నవలోకం బయ్యె వనము నారీమణియున్. 39

కం. మును 'హెస్బోను'కు నిరుదెస
ఘన మగుకాసారయుగము గనిపించునటుల్
వనితవిశాలాక్షియుగము
గనిపించెన్ వాని కట ముఖమునిరుకడలన్. 40

చ. "అలను, గిలాదు" శైలశిఖరాగ్రములన్ జరియించునట్టిమే
కలనివహంబు బారు లయి కన్పడునట్టుల నింతికేశముల్
లలితవచస్సులున్ మధురలాస్యములున్ నవయౌవనంబునున్
గలిగి సవప్రియం బగుచుఁ గన్పడె ముగ్ధశరీరకాంతియుఙ్. 41

తే. నవవసంతపుంస్కోకిలనాదములకు
విరహతాపము వర్ధిలువిధము యువతి
మధుర మై యింపు నింపెడుమాట కతఁడు
తోఁటలో విరహతాపంబుతోనఁ గ్రుంగె. 42

చ. నిగనిగలాడుచెక్కులుఁ, గసినికలున్, బెదవుల్, రదంబులుఙ్,
జిగిభ్రుకుటుల్, దరస్మితము, చెన్నగులాస్యములుఙ్, విలాసముల్
మగువకు నైజశోభ లయి మంగళదేహము నేత్రపర్వ మై
యగుపడు చుండె వాని కట నంగజు నూతనసృష్టియో యనన్.

కం. ముంగొంగు తొలఁగ, మోమున
ముంగురు లల్లల్లఁ బార, ముద్దియచెక్కుల్
గాంగేయాభరణంబుల
రం గగునీలంపుజాలరమణిఁ దెలంగెన్. 44

తే. "తోఁతమను" గోపురంబటఁ దొల్లి "కైరొ"
నగర మధ్యలోఁ గుదురుగ నాటఁ బడఁగఁ
జూచి రెవ్వరో; యాతొంటిచూపఱులకు
యువతి కంధరముగఁ దోఁచె నూహ సేయ. 45

కం. పొదవెడుయెదపుట్టువులఁ
మదజల ముబుకంగ దురద, మంటలు రేగన్
మదనునిసుమబాణములకు
బెదరెను మత్తిల్లి బాల బేలతనమునఁ. 46

ఉ. గుప్పిటఁ బట్టఁ జాల్నడుము, కూపముఁబోలిననాభి, యూరువుల్
చెప్ప ననంటులున్, జెవులఁ జేరెడుబాహుమృణాళముల్, జిగిన్
జిప్పిలుపాదముల్, చిగురుజేగురు లైనకరంబులున్, సదా
యొప్పునఖంబులుఁ గలిగి యుగ్మలిమే నతిశోభ నింపెడున్. 47

వ. అట్లు లావణ్య, తారుణ్యము లొండొంటి నొరసి మెఱయునమ్మత్త
కాశినిని రాజతనయుఁడు వీక్షించి సంభ్రమసాగరలహరిపరిహ
తుఁడై సంకల్పసంభవుని పూములుకులకు నుత్తలపడి పరవశుఁడై
కొంతవడికిఁ దెప్పరిల్లి యా యువతీమణిం జూచి యి ట్లనియె. 48

కవిరాజ విరాజితము:-

సువిహితభవ్యసుసుందరరూపిణి! చోద్యంబయ్యెను నీ వెవరో!
దివిని వసింతువో దేవి! ధరిత్రికిఁ దేజముఁగూర్చెడుతారవో! యీ
భువి దిగి వచ్చినదివ్యకుమారివో, భూమినిఁ బుట్టితో తెల్పఁగదే!
భువిఁ దలిదండ్రులు బంధువు లెవ్వరో? పుట్టినచోటును దెల్పఁగదే.

వ. అన నావనిత మౌనము వహించి యుండుటం జేసి. 50

ఉ. సన్నుతశీల! నాయెడల సౌహృద మొప్పఁగఁ జూడు; బాల! నే
నెన్నఁడుఁ జూడ లేదు; విన నెందును; నద్భుత మిట్టిరూపమున్
గన్నులపండు వాయె నిను గాంచఁగ నీవనమందు నేడుఁ; నో
కన్నియ! నేను జోరుఁడను గాను; వచింపుము నీచరిత్రముల్.

వ. ఇట్లాయువకుండు త న్ననేకవిధంబుల నడుగు చుండఁగా. 52

చ. అవికలచిత్త యై యువతి యాతనివంకను బాఱఁ జూచి. యీ
యువకుఁడు నిర్మలుండు, పెరయూరను నొంటి పరిభ్రమింపఁగాఁ
దివురుట యేల? వీఁడు తనదేశము వీడినహేతు వేమిటో
యవసర మేమి నాపరిచయంబును గోరఁగ వీని కియ్యెడన్? 53

ఉ. సూరిజనప్రియుండు, నవసూనశరాసనసుందరుండు, మా
యూరను జూడ వీని; నను నూరక మాటికిఁ బిల్చు చుండెఁ; నా
దారిని బోవునన్ను మఱి తాకుప్రయత్నము జేయు చుండెడిన్.
గారణ మెద్దియో వినెదఁగాక యతం డెవఁడో యెఱింగెదన్. 54

కం. అని పాంథునిఁ గాంచుచు ననె
నను బిల్వఁగ నేల? నిటుల నాఁపఁగ నేలా?
నిను నే నెఱుఁగను దెరువరి!
చనుమా నీపురముఁ జేర జాల మదేలా! 55

వ. అప్పు డాయువకుం డాసుందరితో. 56

క. మదిరాక్షి ! నాదుమందల
వెదకుచు నిట వచ్చినాఁడ; వేసారకుమా
సదయతఁ జెపుమా యెటికేఁగిన
వెదకెద నందందుఁ బోయి విపినములందున్. 57

వ. అన విని శీలమతి యాతనిఁ జూచి యిట్టు లనియె. 58

క. పొరుగూరిమంద లిందుల
కరుదేరవు; వచ్చి యున్న నవి గనరావో ?
నరుఁడా ! నీ వెవఁడవు నను
బరిహాసము సేయ నిటులఁ బ్రశ్నించెదవో ? 59

వ. అని యామె కఠినముగాఁ బలికిన సాలప్రభుండు. 60

క. నామంద లిందుఁ జేరిన
నేమందువు సుందరాంగి ! యీ ప్రాంతము నీ
కే మందకట్ట? మేపెద;
నా మందలఁ బాఱఁ ద్రోలునరు లిటఁ గలరే? 61

వ. అతని వాక్యంబులకు శీలమతి కోపించి, 62

క. పచ్చికభూములు మాయవి
హెచ్చుగ మాటాడరాదు; హెూబ్రియులము, మా
కిచ్చినభూపతి యెంతయొ
మెచ్చెను మముఁ దూలనాడ మీతర మగునా? 63

వ. మఱియు. 64

కం. అన్నల కెఱిఁగించితినా
నిన్నును నీ పసులమంద నేఁడే తృటిలో
ఛిన్నాభిన్నముఁ జేయుదు;
రెన్నం డిట రాకు; సాకు లేలను బొమ్మా! 65

వ. అప్పు డాసాలరాజు. 66

కం. నోటను బెదరిం పున్నను
మాటికిఁ గఠినంబుగాను మఱి పొ మ్మన్నన్
దీ టగుచూడ్కులు చూడ వ
ధూటిముఖాబ్జంబు చిత్తతోషణ మయ్యెన్. 67

వ. అతనిపరిహాసవాక్యంబులకు శీలమతి యాగ్రహించి. 68

కం. బలశౌర్యసంపదలు గల
చెలువుఁడ! వాక్ఛలములు షెఱచేదెలు వినఁగాఁ
బలుబాస లాడితివి; నీ
ఛలమును కొనియాడుదానఁ జక్కఁగఁ బొమ్మా! 69

వ. ఆబాలికకుఁ తనశౌర్యసాహసంబులఁ బ్రదర్శింపఁ దలఁచి సాల
ప్రభువు. 70

కం. అటు వోయెదుచిలుకా! నీ
విటు ర మ్మొకమాట వినుమ యీతణమందే
వటవృక్షంబునఁ గూర్చొని
పటురయమునఁ బిలువ నంపు పతుల నెల్లన్! 71

వ. శరవేగంబునఁ గీరంబు వటవృక్షంబును జేరి పక్షిజాతులఁ జూచి
మీ మిత్రుఁడు పిలువ నంపె నని ప్రకటించెను. 72

ఉ. అంతటఁ గీరశారికలు నంబరవీధిని బారు గట్టఁగా
వింతగ నీలకంఠతతి విహ్వలతన్ బకకోకజాలముల్
గొంత చకోరవర్గమును గొంగలు హంసలు వానకోయిలల్
గంతులు వేయుచున్ బ్రభువు కౌఁగిటఁ జేరెను సంభ్రమించుచున్

వ అంత నా రాకొమరుండు, 74

తే. బాలికను గంట నొకసారి పాఱఁ జూచి
పక్షిసఖు లంత నిను జూడఁ బరుగు లిడఁగ
మౌనమును బూను టేలకో ! మాటలాడు
పక్షిసంతతి నను మెచ్చుప్రాణు లనుము. 75

వ. మఱియు నాతఁడు జంబుకంబును జూచి, 76

తే. జంబుకోత్తమ ! యడవికిన్ జనఁగ వలయు;
నడవిరాజును మఱివానియాప్తజనముఁ
గాంచి మముఁ జేరుటయె కడు మంచి దనుము
ప్రాణమిత్రుండు సాలుండు పంపె ననుము. 77

వ. జంబుక మాతని యాజ్ఞానుసారముగ నరణ్యమృగంబుల కాతని
మాట నెఱింగించె నంత. 78

చ. పులులును సూకరంబులును పోతర మెత్తినభల్లుకంబులున్
పలు వృకముల్ మహాంగములు వానరముల్ హరిణంబులశ్వముల్
గలఁగెడు సింగముల్ సమదకాసరముల్ శశమేషసంఘముల్
నలుదెసలందు నాతనికి నమ్రత భక్తిని మ్రొక్కు చుండఁగా. 79

వ. మృగఖగంబు లేకమై యాతనికి భక్తి నలుపునంత శీలమతి. 80

ఉ. మిక్కిలి భీతి నొంది తనమేను శిరంబును వంచి భక్తితో
మ్రొక్కఁగ నెల్ల జంతువులు బోటినిఁ జక్కఁగఁ గాంచుచున్ బలే
చక్కనిబాల! నిన్ను శుభసంతతి సేరెను మోద మయ్యె, మీ
రొక్కటి యైనఁ జాలు నని యొప్పుగఁ బల్కెను సర్వజంతువుల్.

వ. అతని కది చిఱుప్రాయం బయినను ఖగమృగంబులభాషలను నేర్చి
వానిమైత్రి నెట్లు సంపాదించె నని యామె యాశ్చర్యము
నొందుసమయంబున రాజకుమారుండు. 82

ఉ. చంచలనేత్రి! కుందనపుఁజాయలమేనుమెఱుంగుదాన! రా
యంచలసేవలన్ గొనుచు నంబర కాంతలకున్ సముంబు లా
నంచితలీలలం గనిన నచ్చెరు వయ్యెడిఁ నప్సరల్ నినున్
మించరు కాంత! యీ శిఖరి మీకు నివాసమొ! తెల్పుమా!
దయన్. 83

వ అతనిమాటల కామె విస్మయం బంది మృదుమధురవచనంబుల
నిట్టు లనియె.

మ. అల "షూనేమి" వసించుబాలికను; నీ యంబుప్రదేశంబులోఁ
గలుగన్ ద్రాక్షవనంబు: భూమి. మఱి బంగారంబు, భాగ్యంబులున్
తలియున్, భ్రాతలు, కర్షకుల్ సతముఁ దాత్పర్యంబునఁ నేర్పుతో
హాలమున్ దున్నఁగఁ బైరులయ్యె. మదిలో నానందమేపారఁగన్.

కం. "శీలమతి" నాదు నామము;
"కాలేబుని" చిన్నితనయఁ; గనుమా; యుష్ట్రా
యేలియులజాతి, వర్షా
కాలము మాద్రాక్షవనముకావలి యుందున్. 86

వ. ఆ నవయౌవనుం డొక ఔషధ సిద్ధుం డని శీలమతి యెంచి యిట్టు
లనియె. 87

తే. యోగిమహనీయ! మందలయోగ మేమొ
నీ వెఱుంగవే? సర్వము నెఱుఁగఁగలవు
యాచకముఁ గోరి వచ్చిన నడుగు మయ్య!
యిచ్చెదను నీకు ఫలముల నెన్ని యైన. 88

వ. ఆయువరాజు హృదయంబులోఁ బ్రేమభావంబు లెక్కు వగునంత.

ఉ. యాచకుడన్; విశుద్ధ మగుయౌవనకాంతమనోవనంబులోఁ
గాచినపండ్లు గోరితిని; గా దనకుండ ననుగ్రహింపు; మా
లోచనసేయు నీవనములో నిను మించుఫలంబు గాంతునే!
యాచిత మిద్ధి; నావయినయాశ నిరర్థముఁ జేయఁ బోకుమా! 90

వ. శీలమతి యాతని పలుకుల కులికిపడి యిట్టు లనియె. 91

ఉ. ఎక్కడి బాంధవంబు మన కెంతటిసాహస మయ్యా నీకు? నీ
వెక్కడివాఁడ వయ్యా! మన కెక్కడిప్రేమలు స్నేహగోష్ఠులున్?
ఎక్కుడు నూహ సేయు మిటు లేమతితో నను గోరినాఁడవో?
నిక్కముఁ దెల్పు మయ్యా! తగ నీదుచరిత్రము నాలకించెదన్. 92

వ. అంతట "షాలెమ" యువరాజు "సాలుం" డామెతో నిట్టు
లనియె. 93

క. "బత్సెబ" రాణికుమారుఁడ
కుత్సితుఁడను గాను నన్ను గోపింపకుమా!
సత్సంగతి విద్వత్సభ
కుత్సాహముఁ గూర్చువాఁడను విదరో! వినుమా! 94

వ. అతఁడు "షాలెమ" యువరాజగుటం జేసి శీలమతి భీతిల్లి తా నతని
యెడల నగౌరవంబుగఁ బ్రవర్తించినందుకు కతఁ డేదేనిఁ గీడుఁ
జేయు నేమో యని యూహించి కొంత యూరడిల్లి రాజనంద
నునకు నమస్కారముఁ గావించి యట నుండ లేక నగము దిగు
చుండగా:- 95

—:మహాస్రగ్ధర:—

నగమే స్వర్గంబు లై యానరులును సుర లై నాఁడు కాన్పించు
చుండన్
జగమే ప్రేమాస్పదం బై సవితృడు విరమించంగ నాసంజవేళన్
నగమందున్ దీప్తి మించన్ సరసపు నడకన్ వారు భూభాగకోరు
మందున్
దిగు చుండన్ గాంతితోడన్ వెలసిరి శశిసందీప్తనక్షత్రభాతిన్. 96

వ. ఆవనజాతి మధురకటాక్షంబు లాతనిపైఁ బ్రసరింపఁ జేయుచు దాక్షిణ్యవనంబునకున్ జనియె నంతట రాకొమరుండు. 97

క. ప్రథమాశ్వాసము పరిణయ
కథ నాయిక, నాయకుడును గలిసినవిధమున్
పృథులముగఁ జెప్పఁ బడె; నిది
సుధీజనుల కంఠహారశోభను గనుతన్. 98



# శీలవతీపరిణయము



## ద్వితీయాశ్వాసము

చ. పరుగున మర్త్యలోకమును బట్టి ముసుంగున దాచునో యనన్
బరవెను గాఢచీఁకటులు బంధురభూవలయంబునన్ దటి
త్తు రసితమేఘసైన్యములతోఁ జనుదెంచి తమిస్రదారులన్
బిరబిరఁ బోవఁ జేసె నరవీరునిముందుకు వెల్గులోపలన్. 1

ఉ యామినికార్యవర్గ మగు యాతుకిరాతులు, చోరఘాతుక
స్తోమము శస్త్రసంఘములతో మును సాగుచు మెల్లమెల్లఁగా
భూమినిఁ దిర్గు చుండఁ బరభూముల కేగెడుబాటసారులన్
క్షేమవిలాసులన్ సతము భీతిలఁ జేయుదు రుగ్రమూర్తు లై. 2

వ. ఆమె కటాక్షముఁ లోనిమాధుర్యంబు నామెమృదుమధురవాక్యంబుల వ్యాఖ్యానంబుగ నూహించు చుండి తనగమ్యస్థానంబుఁ జేరుకాలంబు నాతఁడు పాటింపఁ డయ్యె. అంధకారము వర్ధిల్లె. నక్కలకూఁతలు, దివాంధక్రందనము లాతనిఁ బురోగునిఁ గావింపఁ దనస్థానంబును జేరినపిదప నాతనివిరహతాపము మిత్రులుగ్రహించిరి.

చ. నవనవకామశీలమున నైజపువర్తన మాఱు టయ్యెఁ; సం
స్తవములఁ గోరు టయ్యె మది సాహసకార్యముఁ బూనుటయ్యెఁ,

దివసము రాత్రి నొక్కటిగఁ దీర్పుట యయ్యె విమాత్నరక్తితో
నవయువకుండు కన్య నొకనాఁటనె తోఁటను జూచినంతనే! 4

చ. సఖులను జేరఁ బోఁడు పదిసారులుఁ బిల్చినఁ బల్కఁ బోఁడు; దా
సుఖముగ నిద్రఁ బోఁడు; వెరచూడ్కులతోడ నిగూఢవృత్తమున్
నిఖిలముఁ జెల్పు చుండె; స్పృహణీయత లే దొకవస్తువందునన్
సుఖ మొకయింత లేక యటు సూనశరంబులబాధ నొందెడిన్. 5

వ. ఆకోమలిరూపం బాతనిహృదయంబున స్థిరత నొంది బహుదినంబు
లైనను గార్యావసరంబున నామెను గాంచుట కావనంబున
కేగక తుద కొకదివసంబున నాతఁడు. 6

చ. అటఁ జని యామెరాకకయి యాతురతన్ గనిపెట్టి యుండుచున్
గుటకలు మ్రింగు చుండ నటఁ గోమలిజాడ నెఱుంగ లేక తాఁ
గుటజములందునన్ మఱియు గుల్మములందును నిల్చి యుండఁగా
నట సతి లేనిచింత యనయంబు మనంబును వంత వెట్టఁగన్ 7

మ. ననఁబోఁడిఁ గనకుంటి; నిందు ననుమానం బొంది రా కుండెనో
నను జూడంగను; గాంతకున్ గినుక యో; నాయం దుదాసీన
భావమో;
వనయో; లేక మదీయవాక్కులు వినన్ వాంఛింపగా భారమో;
కనునో లేదొకొ కోర్కెతోడ నను నాకంజాక్షి తోడ్తోడుతన్. 8

క. వనమునఁ బ్రతిచెట్టునఁ దాఁ
గన యత్నముఁ జేసెఁ గాని కానక మగువన్
జనఁ బూనె నామెగ్రామము
మనమున ఖేదంబు పుట్ట మైమఱ పొందన్. 9

వ. ఆనాఁడు తన మనంబు నాకర్షించిన రాకొమరుని నెడఁబాసిన గడియనుండి యాప్రఫుల్లనేత్ర రాత్రింబవళ్ళాతని దివ్యమూర్తినిఁ దన కోమలహృదయంబున స్మరించుచు నాతఁ డాప్రదేశంబున కరిగినకారణం బరయ లేక చింతిల్లి యాతఁ డేల మఱల రాఁ డయ్యె నని వగచి యిట్లు దలంచె. 10

ఉ. అంతటిచక్కనయ్య నను నాదరభావముతోడఁ జూడ నే
నెంతటిదాన నాదుసిరి యెంత సురూప మ దెంత తాను రా
జంతటివాఁడు, సాహసి దయాళుఁడు కార్యధురీణుఁ డెట్లు నా
చెంతను జేరి సంతతముఁ జిత్తములో సుఖ మొందఁ జేయునో! 11

ఉ. రైతుకుమార్తె నే నని విరాగముఁ జెందెనొ యేమొ! లేనిచో
నాతఁడు ప్రీతితోడ ముద మారఁగఁ బల్కఁడె; వేచి యుండి నా
కై తిలకింపఁడే; మునుపు గాంచినచోటును గాచి యుండఁడే
నాతెరగుం గనుంగొన క్షణంబు క్షణంబును గాంచ కుండునే? 12

వ. అని విచారించుచు దినదినం బాతనిరాకకై వనంబునఁ బ్రతీక్షించుచుండె ఆతఁ డెంతకు రానందున నిరాశఁ జెంది కొన్ని దినంబు లావనంబున కేగుటయే మాని యింట దుఃఖసాగరమున మునిఁగి విలపించుచుండి, యేలకో యొకనాఁడు వనంబున కేగఁ దలఁచి. 13

సీ. పాలాశవర్ణంపుపావడఁ దగఁ గట్టి,
పద్మశోణచ్ఛవివల్వఁ జుట్టి,
రత్నఖచిత మైనరవికను బిగఁదొడ్గి
నిక్కెడుగుబ్బలు పిక్కటిల్ల,

గురుతర మైనట్టికొప్పున మల్లియల్
మొల్లలు దిగ జార ముడిచిరి కట్టి;
ముత్యాలహారాన ముద్దులపతకముల్
స్తనకుంభములపైనఁ దాకఁ గట్టి. 13

తే. పాలఁతిమేనఁ గ్రొంజెమటలు పుట్టు చుండ
నడుగులుం దడఁబడుచుండ బిడెముతోడ
బెదరుచూపులఁ బలుమఱు నదరి పడుచు
నేగె ద్రాక్షావనంబున కెమ్మె లొలుక. 14

మ. కడు వేసారుచుఁ బోయె నప్పు డమితక్లాంతిణ బ్రకంపించుచున్;
దడ వయ్యెన్ గనిపింపఁ డయ్యె నతఁ డాతన్వంగి వీక్షింపఁగన్.
గడగం డ్లయ్యెను జాలప్రొద్దు సతి యాకాంతార దేశంబునం
దడియాసణ నిలుచుండె; రాఁ డటకుఁ దా నం దుండి చింతిల్లఁగా

ఉ. ఏయెడఁ జూచినం బడితి నెట్టుల నేగిన వానిమోహిలనే;
తీయనివానిరూపు కడు దీపిద మై కనిపింపఁగా ముదం
బాయెను; సర్వముణ గనఁగ నంగజులోకమొ కాక యెట్టు లీ
కాయజుపూలబాణములు కాఁటియ వెట్టు నటంచుఁ జింతిలున్. 16

ఉ. ఆభ్రమలోకమందు సతి యాతనిఁ బ్రీతిగఁ జూచి వేగమే
తాఁ బ్రతిమాలె నాహృదయతాపము నార్పు మటంచు దీన యై;
నాబ్రతు కింక నీవు వ్యసనంబున వీడకు; నీవు లేని నా
కీబ్రతు కేల నయ్య! నను నేదరిఁ జేర్చెద వోయి! తెల్పుమా! 17

క. అని శోకవిహ్వాల యగు స
తినిఁ గని యాతండు దరికిఁ దీసినయ ట్లా

వనిత భ్రమఁ జెంది వెంటనె
తనమతి భ్రమ యని యెఱింగెఁ దాపముతోడన్. 18

వ. అతఁడింకఁ దనను జూచుటకు వనంబునకు రాఁడని నిరాశతో శీలమతి తనగృహంబును జేరె నంత.

చ. కలకల మాటలాడుసహకాంతలు పిల్చినఁ బల్కదయ్యెఁ; బా
టలు విన నొల్లదయ్యెఁ; దను డాసినకన్యలఁ జూడదయ్యె; నాఁ
కలి యని చెప్పదయ్యె; నధికారము నింటను జేయదయ్యె; లో
కుల గమనింపదయ్యెఁ; దను కోరినవీరుఁ దలంచు నెప్పుడున్. 20

వ. ఇట్లు పెక్కునాళ్లు శీలమతి విరహతాపంబునఁ గృశించి యాతని మఱచిపోవుయత్నములు సలుపుచు నిరంతరముఁ దనసఖులతో విహరించు చుండె. అట నృపతల్లజతనయుఁ డావనితారత్నమును వెదకుచు నొకనాఁడు.

ఉ. క్రచ్చరఁ బోయి తోఁట కటఁ గాంచె సముజ్జ్వలగాత్రవల్లరిన్
అచ్చన లాడుదానిని నమృతాంశుముఖిన్ సుమబాణబాధితన్
విచ్చినప్రాయపుంబువులు విస్తృతవత్తు మలంకరింపఁ దా
నచ్చటిహంసకోకిలల కచ్చెరువున్ బొనరించుదానినిఁ. 22

వ. చూచి సమీపింపఁగా శీలమతి తనను సమీపించు నరుఁడాయువరాజని గుర్తించి యాశ్చర్యచకిత యై యది యొకకలయై యుండునని భ్రమించి నిశ్చేష్టిత యయ్యె. పిదప నతఁడు తనప్రోలం జేరు నంతఁ దాను భ్రమ నొంద లే దని గ్రహించి.

క. ఒకతరి సమ్మదమును నిం
కొకతరి విస్మయము, భయము, నుచ్ఛ్వసనహ్రీ
వికలత; స్వేదసమృద్ధియు,
నొకసారిగఁ బుట్టె నప్పు డుగ్మలి కంతన్. 24

క. చెదరినతనవలువను సతి
సదురుచుఁ దళుకొత్తుచూపు చల్లఁగఁ గాఁగన్
మృదువచనధార జారఁగ
మదిరేక్షణ పల్కె నపుడు మాధుర్యముతోన్.

క. ఎవ్వరికై యిట వచ్చితి ?
వెవ్వరు నీమిత్రజనము లెఱిగింపుము ? నీ
వివ్వన మేలకొ చొచ్చితి ?
వవ్వారిగఁ బల్కు మయ్య! యంగజరూపా ! 26

వ. ఆమె యాదరభావంబుతోడఁ దన్నుగూర్చి ప్రశ్నించె నని యాతఁ
డూహించి యిట్టు లనియె. 27

ఉ. అంచితచంద్రమండలసమాగ్రముఖీ! దయఁ దీర్పు నామనో
వాంఛ; నధీన నైతి; నను బాలను ముంచెదొ నీట ముంచెదో
యంచితసద్గుణా! భవదుదారతఁ గన్గొని వచ్చినాఁడ; నీ
మంచితనంబుఁ జూపి ననుమాన్యునిఁ జేయుము కామిసంతతిన్. 28

అల నిను జూడఁగానె మఱి యంకిత మయ్యెను నాదుచిత్తమో
లలనరొ! నిన్ను దొల్లి యచలంబునఁ జూచినదాది; యప్పుడే
కలియుట కేను నిన్ను వెదకఁగను బొల్చుతి నీదుపల్లెకుఁ;
దెలిపితి నీకు నామనసు; దీనుఁడఁ; బ్రేమ మొసంగు చెల్వరో! 29

అతఁ డవ్విధంబునఁ బ్రార్థించు చుండఁ దన హృదయంబున వర్ధిల్లు ప్రేమాతిశయంబున కాకాంతాలలామ తన కోరిక లీడేరెనని హర్షాంబుధిం దేలినదై యాతనికి దన మనోవృత్తాంతంబుఁ గొంతఁ దెలుపఁ దలచి యిట్లు లనియె. 30

పుష్పశరుండు నీకు సరిపోఁడు నిజంబుగ నందకాఁడ! నేఁ
బుష్పము లిత్తుఁ గైకొనుము పుణ్యవతంస! విహారకేళి మా
పుష్పవనంబునందు సరిపోదు; విరాళి యదేల? పొమ్మ యే
పుష్పలిహంబు లింపుఁ జనఁ బూనవు భూవర! నీ వెఱుంగవే!31

రాజనందనుఁ డామెపలుకు లాలకించి. 32

తుమ్మెద వార్లఁ బుష్పములు తోలనె దానిని నిర్దయఁ; దదీ
యమ్ములు శబ్దముల్ చెవియఁదన దూరిన మూసికొందురే;
కమ్మనిపాట పాడెడు పికమ్మును వృక్షము పారఁ ద్రోలునే;
పొమ్మన వచ్చునే హృదయపుష్పముఁ గ్రోలఁగ వచ్చినట్టినఁ.

అన విని శీలవతి. 34

మధుపమ! నీవు కాననసుమంబులఁ గ్రోలఁగ వచ్చు టేలకో;
మధురఝర మెుల్కు పుష్పముల్లమంధ్యములై పుర్మముఁదునుండఁగా
మధురసపానముఁ గొనుచు మల్లెల జాజుల నుత్తరింపుమా;
మధుసఖసోదరా! కడిఁది మాటలు చాలును పొమ్మ వేగమే.

వ. అన యువరాజు. 36

తే. అడవిమల్లెలయందంబు నచటిమధువు
తియ్యదనమును దావియు దీప్తిఁ గొలువు;
వనిత! ఆమల్లెఁ గొనిపోవ వచ్చినాఁడ
నన్ను వారింపఁబోకుము సన్నుతాంగి. 37

వ. అనఁగా శీలమతి. 38

చ. అడవులలోనిపుల్లెపువు లందుకొనన్ జతనంబుఁ జేయఁగా
నిడుములపాలు గావలయు; నిల్లును గ్రామము వీడఁగావలెన్
గడు నొడుదుడ్కులం బడుచుఁ గంటకమార్గముఁ ద్రొక్కఁగా
వలెన్
బుడమికి ఱేఁడ! నే నడవిపూవును నీ కిటులేల కష్టముల్. 39

ఉ. పూర్వజుఁ డొప్పునే? జనని, పుట్టిలువారలు సమ్మతింతురే?
యుర్విని బెద్దవార లిది యొప్పుదురే? మఱి బంధుకోటికిన్
సర్వజనాళి కిట్టిపని సమ్మత మౌనె? హితంబు సెప్పెదన్
బూర్వజుఁ గాంచి శాంతముగ భూవర! వేఁడిన నీకు మేలగున్.

వ. అని పలుకఁగ నాతఁడు తన హృదయంబునఁ బెల్లుబుకుహర్షా
ద్భుతరసతరంగములపొంగును నిలుప లేనివాఁడై యామెను
సమీపించి యిట్టు లనియె. 41

క. నీసుప్రలాపములు విని
యోసఖి! యానందవార్ధి నోలలాడుచు నే
వేసట మానితిఁ; గష్టము
పాసెను వచనామృతంపువానలు గురియన్. 42

క. నీయన్నల నీతల్లిని
నీయర్మిలి బంధుజనము నే మెప్పింతున్;
నాయ దుఁ బ్రేమ నిలుపుము;
నీయాళను దెలుపు నాకు నీరజనేత్రీ! 43

వ. అతని వాక్యంబులను సందేహించి శీలమతి యిట్టు లనియె. 44

ఉ. రాజుల నమ్మరాదు; యువరాజులమాటలు గావు పాటి; యా
రాజులు సూపునట్టియనురాగము, భావము శాశ్వతంబులే
రాజులు భోగకాంక్షులయి రాయిడిపెట్టుదు రన్యలోకులన్;
వ్యాజముఁ జూపి చంపుదురు వాఁడని వీఁడని యెంచ కందఱన్.

వ. అన యువరాజు. 46

ఉ. యూదులవంగడంబులను నుండరు వంచకు లెందు నుర్విలో
వేదముతోడు యూదులిలు వేలుపుతోడని యొట్టు వెట్టితిన్
ఏ దెటు లైన నేమి నిను నెన్నడుఁ బాయను నీరజాక్షి! నే
నాదర మొప్ప నీయెదుట నంతయుఁ జెప్పెద నమ్ము సుందరీ!47

వ. అంతట శీలమతి. 48

తే. సరస! నీయొక్క మంచిప్రసంగములకు
లొంగి కోమలహృదయములోన నిన్ను
నిల్పుకొంటిని; జేలను నిజము నెఱుఁగ;
నేమి సేతువో! కీడు, మే లెవరు గంద్రు. 49

వ. ఆమెదీనాలాపంబుల కాతని హృదయంబు కరఁగి యిట్టులనియె

ఉ. శీలమతీ! భయంపడకు; చేటులు గల్గవు; నీవు రాణి వై
బాలః యథేచ్ఛగన్ మిసిమిబంగరుమేడలలోన నుండ భూ
పాలుఁడు నీకు బద్ధుఁ డయి పాలన సేయఁగ లోప ముండునే
మే లగు నీకు దేవి! యిది మెచ్చినదేవుని వ్రాఁత యయ్యెడున్

క. స్వైరముగ రాజహంసలు
చేరును మానసము సతము జీవించునటుల్
కోరిక లీడేఱఁగ రమ
చేరును నీపాదములను జెలియరో! వినుమా! 52

వ. అతని వాక్యంబులచే సందేహము వాసిన దై మధురస్వరంబున
నామె యిట్లనియె. 53

ఉ. గణ్యగుణాకరా! యవనికాంతతనూభవ! ధీర! శూర! కా
రుణ్యపయోద! యాదకులరూపగుణాన్విత! భవ్యనవ్యతా
రుణ్యాయశోవిశాల! రవిరోచిరుదంచితతేజ! కామలా
వణ్య! కృతార్థురాలను భవాదృశుపాదముదాపుఁ జేరితిన్. 54

వ అని చిఱునగవులు సంధిల్ల నాకోమలాంగి ముదంబునఁ బ్రియా
శుఫలంబులఁ దనప్రియున కిచ్చినంత నాతండు. 55

చ. హృదయము లేక మయ్యె, మనయిచ్ఛలు నేఁడు ఫలింప
నయ్యె; సం
పదలు లభింప నయ్యె; నరపాలునభీష్టము దీర నయ్యె; నా
పద నెదిరింప నయ్యె; సతిబంధువులన్ మురిపింప నయ్యెడిన్;
దదుపరి కన్నతల్లి కిది తప్పక తెల్పఁగ ముఖ్య మయ్యెడిన్. 56

వ. ఈ విధంబున వారలు పరస్పర సంభాషణములు చేసి యొకరి
నొక రెడఁ బాయ కుండఁ బ్రమాణంబులు సేసి యొకరిముఖం
బు నొకరు సూచుచు నిలుచుండిరి. అంత రాకొమరుం
డామె యానతినిఁ గొని పోవ నామె. 57

ఉ. మాపిత "యాబ్రహాము"నిఁ గుమారుని, "రిబ్కను" గాచి నట్టిదే
వా! పినదాన నైననను, వాసిగ నేను వరించినట్టియీ
భూపతిపుత్రిరత్నమును బూజ్యులఁ జేయుము మేదినిన్ సదా
యాపద లెల్లఁ బాపుచు దయామయ! దీనులపాలిదైవమా!

తే. ఇష్టదేవతాప్రార్థన లింతి సేసి
తన మనంబునఁ దలపోసి దైవమహిమ
సర్వవిభుకల్పనమున కాశ్చర్య మంది
భావిభాగ్యంబు నాశించి పడఁతి యుండి. 59

క. అంగీకృత భావంబునఁ
బొంగారుచు ముద్దుగుమ్మ పోయెఁ గ్రీడా
సంగీతంబులు సలుపుచు
శృంగారము మీఱఁ దనదుగృహముఁ జేరన్. 60

వ. హృదయేశ్వరిని వనంబున విడిచి తనస్థానంబున కేగుచు రా
కొమరుం డిట్లని తలంచె. 61

ఉ. ఈ యువతీలలామ కడుబుజ్జి, యభీరువు గాఁగఁ దోఁచెడిన్
దీయనిశీలమున్ మఱియు దీప్తసుభావసుధీసమగ్రియై
కాయజు ధిక్కరింపఁ గలగట్టిజితేంద్రియనిస్పృహత్వముల్
పాయక సద్యశోనిలయ బాల కడుంగడు నొప్పుచుండెడిన్. 62

ఉ. తాను వరించినట్టి వనితామణి శీలమతిన్ గడిందిస
మ్మానముతోఁ దలంచుచును మానవతిన్ దిలకించి చిత్తరుడ్
బాణనిహన్యమానుఁ డయి బాధ సహింపఁగ లేక కుందెడున్;
గానన మంతయున్ దనకుఁ గాయజులోకము గాఁగఁ
దోఁచెడిన్ 63

వ. ఇట్లు తనహృదయేశ్వరిగుణగణంబులు ధ్యానించుచుఁ దన
స్థానంబుఁ జేరెను. 64

క. శీలమతీపరిణయ మను
"షాలేము"కు నృపతి యైన "సాలుని" చరితం
బాలేఖించుచు ముగిచితిఁ
జాలుగ భాగద్వయంబు సంపూర్ణముగన్. 65



# శీలమతీపరిణయము

## తృతీయాశ్వాసము

వ. శీలమతి తన్ను వరించె నని భూపతిపుత్త్రుఁడు సంతసిల్లి నిరం
తర మామెనుగూర్చి ధ్యానించు చుండె నట్లు కొన్నినాళ్ళు
గడవఁగా నాతఁడు తనజనకునియాజ్ఞపై వేఱొకప్రాంతంబున
కేగవలసినవాఁడై యొకప్రభాతంబునఁ బ్రయాణ మగునంత.

ఉ. రేదొర కాంతిహీనుఁ డయి రిక్కలుఁ దాను నిష్క్రమింపఁగా
నాదెసఁ బద్మబాంధవునియంశుసమూహము సంక్రమింపఁగాఁ
బూదరి చందమయ్యె దివి, భూతల మాయరుణోదయంబునన్
సాదరహర్ష నాదములు సంస్తవముల్ చెలరేగు చుండఁగన్. 2

ఉ. "మోరియ"పర్వతంబు దిగి ముచ్చటగా నదిపాఱుచుండగన్
దీరమునందు "మూనెమియ"దివ్యపురం బొకచిత్రదృశ్యమై
పేరు గడించె దానిసరి పృధ్విని వీడులు లే వనంగ నా
యూ రొకనూఱు స్వర్గపురమో యన నొప్పెఁ దలంచి
చూడఁగన్ 3

చ. నది కెదు రేగునోడలను నాణ్యముగా నడిపించునావికుల్
కుదురుగ నొక్కరేవునకుఁ గూడెడునోడల నిల్పునావికుల్

ఉదకము పాఱుదిక్కునకు నుద్ధతి నోడలఁ దోలునావికుల్
ఉదయమునందు "షూనెమియ" యూరికి నందముఁ గూర్చు
చుండగన్. 4

ఉ. ఆనదినీరమందుఁ గలహంసలు జాతులు కొంగగుంపులున్
మీనకుళీరకూర్మనడమీనసమూహములున్ భుజంగసం
తానము నక్రముల్ మఱియుఁ దక్కినజీవులు సంచరింపఁగన్
"షూనెమి"యూరునోయగము చూపఱ కందముఁ గొల్పు
చుండఁగన్. 5

ఉ. మానక యాపగాంబుపవమానము వీవగఁ గేకిసంఘముల్
మానుగ నాట్య మాడఁగను మంజుల మై కనిపింపఁగాఁ బసీ
చీనముగాఁ బ్రసూనములు చిన్నరిపొన్నరికాంత లై ప్ర స
మ్మానితశీలతన్ మెలఁగ మంగళముల్ విలసిల్లె నప్పురిన్. 6

సీ. ప్రత్యూషసంస్తుతుల్ పఠియించి కొందఱు
"సునగోగు"ముం దుండి చూచువేళ
వారిఘటాలతోఁ బరిహాసముల నాడు
కాంత లాయేటికిన్ గదలువేళఁ
బురవృద్ధులు గవనుపూర్వభాగమునందుఁ
గూడి ముచ్చట లాడుకొనెడువేళ
స్నాన మాడుచు బ్రహ్మచారులు వరుసగా
నవసూర్యకాంతిలో నడుచువేళ

తే. బాలబాలికల్ మఠములోఁ బాఠములను
జదువుకొనుటకు గుంపు లై సాగువేళ

సూర్యకాంతులు క్రమముగ సోకువేళఁ
బురముఁ జేరెను సాలభూవరుఁడు నాఁడు. 7

వ అట్లా ప్రాంతములోని ప్రకృతిసుషమఁ గూర్చు మోదంబున
నాతండు ప్రయాణము సేసి సూర్యోదయంబున 'షుంసెమియ'
నగరంబుఁ జేరునంత నొకపౌరుం డాతనిఁ జూచి యిట్లు
లనియె. 8

ఉ. మానితవర్తనుండ! సుకుమారుఁడ! శోభితసత్ప్రతాపరూ
పానుగుణుండ! సత్కులజుఁ డౌ సుకృతాత్ముఁడ! నిన్ను మించి స
న్మానితు లెవ్వ రయ్య! యనుమానము లేక వచింతునయ్య! నీ
స్థాన మ దెద్ది నీకుఁ దలిదండ్రులు లేరొకొ యిట్లు పోవఁగాన్.

వ. అనిన నప్పలుకులకు నన్నరపతిసుతుం డిట్లనియె. 10

ఉ. మందలఁ గాచువాఁడ, వనమధ్యమునన్ జనుగొల్లవాఁడ నా
కెందున లేరు మిత్రతతి యేటికిఁ దగ్గఱిపల్లెయందు మా
మందలు పంటభూములును మానుగఁ దోఁటలు విస్తరిల్ల, నే
కందును లేక నే నిచటఁ గాపురముం దగఁ గొంచు నుండెదన్.

వ. ఆతని పలుకులకు సందేహించి పౌరుఁ డిట్లు లనియె. 12

ఉ. గొల్లలఁ బోలెఁ గన్పడవు గొప్పకులంబునఁ బుట్టినట్టిభూ
వల్లభుఁ బోలురూపమును వాసియు నీయెడఁ జూచుచుంటిఁ గా
గొల్లఁడ వైతి వెట్లు? మఱి గోష్ఠలమందల నెందు వీడి మా
పల్లెకుఁ జేరి తీవు తగఁ బల్కుము; పోదము రమ్ము యింటికిన్.

వ. అట్టియెడ నృపనందనుఁడు. 14

క. దేవునిసంకల్పము మన
పావనసంబంధ మధికభాగ్యం బయ్యెన్
గావున మీయింటికిఁ గొని
పోవఁగ మే లగును నాకుఁ బుణ్యావతంసా! 15

వ. ఆ మాటకు సంతసించి యాపౌరుఁ డాతనితోఁ గృహంబుఁ
జేరునంత భూపతితనయుం డిట్టు లనియె. 16

ఉ. ధార్మికవర్య! యాశ్రితుల దగ్గఱఁ దీయునుదారధీమణీ!
నిర్మలదేశభక్త! రమణీయగృహంబునఁ జేర్చి తీవు, నా
కర్మఫలంబు నీగ నెటుఁ గానక దేశము సంచరించి, నీ
నిర్మితసౌధరాజమున నిర్వృతిఁ బాదము హర్ష మొందితిన్. 17

వ. అది విని యాపౌరుఁడు. 18

ఉ. 'షాకరు' నాదునామము 'ఇషాకరు'వంశమునందుఁ బుట్టితిన్
నా కొకచిన్నతమ్ముఁడును నందన యిద్దరుచెల్లియండ్రు, పేర్
మాకర మైనతల్లి ముద మారఁగ మమ్మును బెంచు చుండఁగాఁ
జేకుఱు ధాన్యముల్ పొలముచెంగట ద్రాక్షయుఁ దద్వ
నంబునన్ 19

వ. అని యిత్తెఱంగున నయ్యిరువురును సంభాషించినపిదప సాల
రాజు తనమార్గంబునఁ బోవు నంత. 20

క. హృదయేశ్వరి బంధువులను
ముద మారఁగఁ జూచినాఁడ ముచ్చట యయ్యెన్
ఇది శీలవతియి ల్లని
మదిఁ దోఁచెడిఁ బరుల నడుగుమాటల వేలా? 21

వ. అవ్విధంబున నూహించుచు నాతఁడు ద్రాక్షవనంబుఁ జేరు
నంత. 22

ఉ. ఉయ్యేల లూదుటల్ సరసు లొప్పెడుశ్రావ్యము లైనగాన
ముల్
తియ్యనినాదసంగతి శ్రుతిపరిణయంబుగఁ బాడు చుండగాఁ
నయ్యను వైనసుస్వరము లందలిగంధవహుండు మోసికొం
చొయ్యనఁ గాంతుఁ జేర్పఁగను నోర్పునఁ దా నడయాడు
చుండెడిన్. 23

క. ఆమధురగానమును విని
యామెను లేఁబూపుఁదోఁటయందునఁ జూడన్
దా మధుసఖబాధితుఁ డయి
కోమలికై వేగఁ బోయెఁ గుతుకము మీఱన్. 24

వ. దూరమునుండియే యాసుందరాంగునిఁ జూచి యామె డో
లాందోళితమానస యై యుండఁ దనచెలికత్తెలున్ దూర
మేగునంత. 25

ఉ. ఆలలితాంగి హర్షమున నాతనికామసమానదేహమున్
బాలశశిప్రభాస్మితము భాసితబాహులఁ గాంచి య..త నా
బాలిక మెచ్చి యాయువకుపాలికిఁ జేరఁగఁ బోవు చుండఁగన్
గోలగ నవ్వి రందఱును గోమలి లజ్జిత యై తొలంగఁగాన్. 26

వ. అయ్యవసరంబున రాజనందనుఁడు. 27

ఉ. చంచలనేత్రి! నాహృదయసారసమందు భ్రమించుభృంగమా!
కొంచెము సేపుక్రిందటనె కోమలి! నీకయి నీదుగేహమున్
గాంచఁగ నేఁగి బాధువులఁ గంటిని; వారికిఁ దెల్ప నీతి గా
దంచుఁ, దలంచి వచ్చితి హృదంతరమందున నిన్ దలంచుచున్.

పంచ. లలామ! నాకు భూరిరాజ్యలక్ష్మియే లభింపఁగా
ను, లాలితంబుగాను, నీదునోములే ఫలింపఁగా
విలాసినీ! ఘనంబుగాను బృథ్వి కెల్ల రాణి వై
చలత్వ మేమి లేక రాజ్యసంపదల్ భజింపుమా! 29

వ. తనహృదయేశ్వరునివచనామృతంబున కెంతయు హర్షించి
శీలమతి దీనముగా నాతనితో నిట్టు లనియె. 30

సీ. పట్టపురాణి నై భాగ్యసౌభాగ్యభో
గములనే పడయ ముఖ్యంబు గాదు;
రాణి నై నీయింటిదాన నై మహీమధు
రీణ నై బ్రతుక నారీతి గాదు;
అధికారవతురాల నై పెద్ద సౌసౌధ
ములవిహారంబు నామురుపు గాదు;
ఘనురాల నై సంతు గలదాని నై రాజ్య
భోగమే నాగొప్పబుద్ధి గాదు;

తే. రాణి నైతినా యుచితమే, కానియెడల
వగవ నెన్నఁడు నీవె కావలయు నాకు
రాజ వై నీవు సంపదరాశి గలిగి
రాజ్య మేలఁగ నీదాసురాల నగుదు. 31

వ. భూపాలతనయుం డాసునిర్మలవాక్యంబులు విని హర్షించి
యామెను దగు వాక్యంబుల నోదార్చి తనప్రోవఁ బోవునంత
నాకన్యాలలామ తనమనంబున నిట్లు దేవునిఁ బ్రార్థించె. 32

సీ. “పద్దనరాము” “లాబానుని” బిడ్డ “రా
హేలు”కై యా“ఇశ్రాయేలుఁ” గాచి,
“తిమ్నాతు” “తామారు” దీనను గావఁగ
యూదగోత్రంబును నుద్ధరించి.
యన్యదేశపుఁగన్య “ఆసనత్” ప్రార్థింప
“యోసేపు”మంత్రిగా నొసరఁ జేసి,
మఱియు “ఇత్రో”పుత్రి మగనికై ప్రార్థింప
“మోషే”కు “మిసరు”లో ముక్తి నిచ్చి,

తే. శ్రితులఁ గాపాడి ధరను బోషించె నెవఁడు;
తనను బ్రార్థింప దీనుల దలఁచె నెవఁడు;
యూదజనమును ధర నాటి యుండె నెవఁడు;
మమ్ముఁ గాపాడఁ బూనఁడె మహిని వాఁడు. 33

వ. అట్లు తన ప్రియుని విజయంబునకై భగవత్ప్రార్థన సలిపి
శీలమతి చింతాక్రాంతురాలై యొకచోటఁ గూర్చుండునంత
నామె చెల్లెలు “పాద్మతి” యామెను జేరి యిట్టు లనియె. 34

క. అక్కా! వింటివె కాంతలు
పక్కన నవ్విరి విచిత్రపరిహాసముతో
నెక్కడివాఁడో వానికిఁ
జిక్కితి వని యొకరి కొకరు చేసన్నలతోఁ. 35

క. అండజగామిని ! తెల్పు మ
తం డెవ్వఁడు? వాని నేల దాపించితివో
గండము తప్పక వచ్చును
కొండెంబులు చెప్పునట్టికోమలు లుండన్. 36

వ. అంతట శీలమతి కంపించినదేహము గలదై "పాద్మతి"తో నిట్టు లనియె. 37

క. అతఁడే నాహృదయేశ్వరుఁ
డతఁడే నాజీవితాశయము నామోదం
బతఁడే నా కాధారం
బతఁడే నాపతియు గతియు నంబుజనేత్రీ ! 38

క. అన వల దిదియు రహస్యము
మనవారలు వినఁగఁ గీడు మా కిలఁ గలుగున్
నిను నమ్మితి "పాద్మతి!" మ
మ్మును గావుము హితవు డెందమునఁ గోరఁగదే! 39

వ. తదనంతరం బాచెలికత్తెలు వదినెలు నామెం జేరి. 40

ఉ. నీదరహాసితంబులును నీనవచంద్రికఁ బోలుమోము నీ
సాదరభాషణంబులును సజ్జనభావము చాతురీగుణం
బోదయితా ! ప్రశస్తములు; నున్మదమన్మథుఁ డెవ్విధంబుగా
నీదుమనంబు నొంచె నిటు నీ విఁక దాచిన దాగునే సఖీ ! 41

వ. అనఁగా ముసిముసినగులు ముఖచంద్రు నలంకరింప శీలమతి దనమనంబున. 42

ఉ. నేను వరించినట్టిధరణీపతిపుత్త్రుఁడు ధీరశాంతుఁడున్
దీనదయాళుఁడున్ వినుతదివ్యన రూపుఁడు నన్ను గోరెఁ; దా
జ్ఞానపయోధి నన్ను దొరసానినిఁ జేయును సంతతంబు నా
లోనిపవిత్రభక్తి పతిలోకమునన్ గనిపించు చుండెడున్, 43

వ. అట్లాకన్యారత్నముఁ దాను వరించిననరునిఁ గూర్చి ధ్యానిం
చుచుఁ దనగృహంబున కేగునంతఁ చెలికత్తెలు దమలోఁ దా
మి ట్లూహించు చుండిరి. 44

ఉ. ఈమె యమాయకం బయినహృత్కమలంబును నిల్పెఁ జ
ప్రేమతో
నేమివిమర్శనంబు మది నెప్పుడుఁ గోరదు మాట వల్కదే
ఆమె యెఱుంగ లేదు ధర నాతని యాప్తులపుట్టుపూర్వముల్
కోమలి నమ్మెఁ; జూచునె సగోత్రుఁడొ కాఁడొ య టంచు
నాత్మలో. 45

ప్రేమవిలాసినుల్ దమయభీష్టము నించుక వెల్లడించినన్
ధీమతు లైనవారు వెను దీయక వారల నాదరింపరే?
యామె వరించినట్టిహృదయేశ్వరునిన్ సమకూర్చుమాన్య శ్రీ
కోమలియొక్క సోదరులె: కూరిమిఁ దిద్దురు వారె కార్య
మున్. 46

ఉ. అన్న లెఱింగిరేనిఁ జెలి కాపద లుండవు నిశ్చయంబుగా
మన్నన లన్ని జర్గు; ననుమానము సేయక యెట్టులేని నా
కన్నియ కోరుకొన్ననర కాంతునిఁ గాంతురు వానివర్తనం
బున్నది యున్నయ ట్లెఱిఁగి యుక్తముగాఁ జరిగింపకుందురే!

వ. అని వారు దమయంత్త కావిషయంబు నెఱిఁగించునంత నామె.

క. ఎవఁ డాయువకుం డాతం
డెవరైను సంధి పఁ గోరి యేకాంతమునన్
బువ్వుఁదోట కేగుచును నే
యువతిన్ వరియించి వచ్చె నున్నది సెపుడా! 49

వ. అది విని వారలు. 50

ఉ. వానితనూవిలాసములు వాసిగ "యూసఫు" ధిక్కరించు; సం
సోనును" మించుపౌరుషము, సూక్తులలోపల మించుఁగాదె. "హా
రోను"ని విద్యలందున "ఫరో"గురులన్ దనగోట మీఱు; స
వ్వానినిఁ జూచుదృష్టి పెఱవారలఁ జూచుట కొప్పుకో దిలన్.

ఉ. తోఁటకుఁ బిల్చి పక్షితతితో నతఁ డేమి వచించి యుండెనో
నాఁటిక్షణంబునుండి యవి నమ్మిన కావలిబంటు లయ్యె; నా
బాటను బోవునట్టిమృగవర్గము గూడను బ్రేమఁ జూప నా
నాఁటికి మేటిదా శ్రీతఁ వనంబుఁ గనన్ "పరదైసు"నాఁబడున్.

వ. తదవసరంబున జనని దనకూతుఁ బిలిచి యిట్టు లనియె. 53

క. పరదేశిని సమ్మదమున
వరియించినఁ జెప్పు మమ్మ! వగవకు మమ్మా!
వరకన్యక మనస పెనఁ డప
హరించెనో చెప్పు మమ్మ! యాతని చరితన్. 54

వ. అంత శీలమతి. 55

ఉ. చక్కనిదివ్యమూర్తి గుణసంతతి సుప్రథితుండు గాని, వాఁ
డెక్కడివాఁడొ వానిజన మెక్కడనో యెఱుఁగంగనైతి నే
నొక్కట వాని, నాతనిప్రియోక్తులరూపముఁ జూచినంతటన్
జిక్కితి వాని కింక మఱిఁ జేయున దేమి? విదల్పఁ జాలునే 56

వ. కూఁతువాక్యంబులకు జనని యాశ్చర్య మొంది యా నరునివృత్తాంతంబు నెఱిఁగి యామె యభిమతంబును సఫలం బొనర్చెద నని యిట్టు లసియె 57

మ. తగుదాంపత్యముఁ గూర్చుభార మొకటన్ ధర్మజ్ఞుఁ డౌ తండ్రి బా
గుగ గుర్తించెను; దల్లియున్ దిగులుతో గోల్పోవుబిడ్డన్ బ్రియం
బుగ రక్షించెను; యోగ్యుఁ డౌవరునికై భూలోకమున్ జుట్టి మే
లగుదాంపత్యముఁ గూర్పఁ దండ్రి సతతం బాలోచనం జేసెడిన్.

వ. తనకూఁతురు వరించిననరునివృత్తాంతం బెఱుంగ లేక తల్లియు భ్రాతలుఁ జింతించిరి. దీర్ఘకాలం బయ్యెఁ దనప్రియునివార్త విన నందున శీలమతి దినదినంబుఁ గృశించు చుండెను. 59

చ. కలవర మొందు నొక్కటను గానక తాఁ బ్రియు; నేడ్చు నొక్కటన్
వెలవెలఁ బోవు రాఁ డనుచుఁ, బిమ్మటఁ దాఁ జనుదెంచు నంచు; నా
కల నిజ మంచు నవ్వును; వికాసముతోఁ దరలాక్షి యంతనే
పలుకుట మాను; దుర్భరవిపత్తున మున్గి నిరాశఁ జెందుచున్. 60

వ. ప్రియుని దీర్ఘకాలంబుఁ గానక శీలమతి విలపించు చుండ. 61

చ. తనసఖు లొక్కసారి పరితప్తమనంబున దిక్కు దోఁచకే
యనిశము నేడ్చుదానిఁ గని, యాదరణంబున మాట లాడి, యా
తనిఁ గొని రేఁడు వేగ మనుచున్ బ్రతిమాలఁగ వార లంత వా
నిని నిను గల్పువార మని నీరజనేత్రినిఁ దన్పి రెంతయున్. 62

వ. ఇట్లు చెలికత్తెలు సముచితాలాపంబుల నామెన్ బ్రసన్నచిత్తం
జేసి తమతమమందిరంబుల కరగినంత శీలమతి నిరంతరంబుఁ దన
హృదయేశ్వరునికై విలపించుచు దీర్ఘకాలం బయ్యెను గాన
నిరాశఁ జెందినదై పనిపాటలయం దశ్రద్ధ గల దయ్యెను.
నాఁడు శీలమతిని వీడ్కొని యువరాజు రాజధానిఁ జేరునంత 63

మ. అల వైతాళికులున్ బ్రభాతమునఁ దా మారావముల్ సేసి యూ
దులరాజున్ వడి లేప రారు; నవమాధుర్యంబు లొల్కంగఁ బా
టలు పాడఁగను రారు; మంత్రులును మాటాడంగ రారైరి; భూ
తలనాథుండు తపించు చుండె రుజతో దార్ఢ్యంబు క్షీణింపఁగన్. 64

వ అప్పుడు చైత్రభూపతి రాజ్యపాలనంబు జ్యేష్ఠపుత్త్రుం డైన
"పారీంద్రు"న కప్పగించె నంత. 65

చ. జనకుఁడు వృద్ధుఁ డై లలితసద్గుణమూర్తిని జ్యేష్ఠపుత్త్రునిన్
ఘన మగురాజ్యపాలన మగత్యము సేయు మటంచుఁ బల్కఁగా
వినయముతోడ రాజ్యమును విశ్రుతిఁ బాలన సేయుచుండఁగా
జనపద మంత సంపదలచక్కనియిక్కగఁ దేజరిల్లఁగాన్. 66

ఉ. సోదరు లల్కచేఁ దమకు సూటిగ రాజ్యముఁ బంచు మంద్రు; మి
త్రాదులు వారిపక్షమున నండగ యుద్ధముఁ జేయు చుంద్రు; వే
లాది జనంబు వారియెడ నాదృతిఁ జేతురు గాన నీవు సో
లాదులఁ దమ్ములన్ గనుచు నచ్చెరు వొందఁగఁ బట్టి తెమ్మనన్.

చ. తదుపరి దండనాయకునిఁ దక్కినవీరులఁ బిల్చి వారికై
మది దయఁ బూన రాదు: మఱుమాటలు సెప్పఁగ రాదు; వెంటనే
పదుగురు నాదుసోదరులఁ బట్టి వధింపుఁడు; వీలు గానిచో
నదటునఁ బట్టి తెండు మిము నంతటఁ గాచెద నేను రాజనై. 68

వ. అని దండనాయకాదులఁ బంపునంత. 69

చ. అరమర లేక వానిహృదయాబ్జమునందున గౌరవించుసో
దరులను బట్టి తెచ్చి యతిదారుణశిక్షలపాలు సేసెఁ; గా
పరులను జూడఁ బోయి యెటొ పల్లెలయందునఁ దిర్గువాని, నా
గరువపు సాలభూపతినిఁ గన్గొన లే దని యాగ్రహించుచున్. 70

వ. దండనాయకుండు సాలరాజును బట్టి తెచ్చుటకై భటులను బంపఁగ,
వారు దన్ను బంధించి కొని పోవుటకు వచ్చి రని సాలరాజు రాజ
ధానిని రాత్రికాలంబుననే వీడి యరణ్యములలోఁ దిరుగునంత. 71

క. ఊరూరు వెదుకు చుండిరి
వారికిఁ గనిపింపఁ డయ్యె వసుధేశుఁ డెటుఁ
బో రానిచోట్లఁ బోయిరి
ఘోరాటవులందు రాచకొమరునికొఱకై. 72

చ. వనములలోన నంతఁ బసివాఁడు నధీరుఁడు సంభ్రమంబుతో
దినదినమం దరిష్టములు తీవ్రత నాతని నావరింపఁగా
ననుజునిచేతఁ బంపఁ బడినట్టిభటుల్ వడి వెంబడింపఁగా,
దగ సాలరాజు భయ మందుచుఁ బాఱెను వెన్ను సూపుచున్.

క. అందముగ శీలమతికథ
యందున మూడవది ముగిసె నాశ్వాసం బా
నందం బొందఁగ సరసులు;
నందఱునున్ జదివి దీని సాంతముగాఁగన్. 7

# శీలమతీపరిణయము



## చతుర్థాశ్వాసము

వ. శీలమతి తన్ను వరించినసాలరాజు వృత్తాంతంబుఁ దనభ్రాతలకు జననికి నెఱిఁగింపదయ్యె, వార లాతనినిజస్థానం బేదియో వాని జననీజనకు లెవ్వరో యెఱుంగ లేక బాలిక యాతనిచే వంచింపఁ బడిన దని యూహించి స్థానచలన మొకింత నామెమనోవేదనఁ దగ్గించు నని "లెబానోను" ప్రాంతంబున నివసించుతనమేనత్త "సలోమి" గృహంబునకుఁ బంపునంత శీలమతి యటఁ జేరి తన మనంబున నిట్లు దలపోయఁ దొడఁగె. 1

ఉ. గొల్లునఁ దల్లి యేడ్చెఁ దనకూరిమిచేతులఁ బట్టి; మేనిపైఁ
జెల్లెలు వ్రాలె; నంత నెదఁ జిమ్మెను బుట్టెడుదుఃఖ; మంతలో
నల్లన నన్ను జుట్టికొని యందఱు కాంతలు నేడ్చినారు; నా
చల్లని మిత్రురాండ్రు విడఁ జాలక యేడ్చిరి వీడు వీడఁగా. 2

వ. మఱియు ద్రాక్షవనమును బూలవనంబునుగూర్చి శీలమతి తన మనంబున నిట్లు తలంచు చుండె. 3

ఉ. పూపొద లెండి పోవు; సురపొన్నలు వాడును; మద్వనంబులోఁ
గాపుర మున్నకేకిచిలుకల్ మఱి కోయిలలున్ దపించు; నా
దాపునఁ జేరి యాడుచు ముదంబునఁ జేరెడు లేడిపిల్లలున్
వాపొడ యెందుఁ గన్పడమి నద్దెనలన్ జని తేఱి చూచెడున్. 4

ఉ. అచ్చటిపర్వతాగ్రములు నచ్చటిలోయ లరణ్యభూములున్
అచ్చట వీచువాయువులు నచ్చటితెల్లనిమంచుగుట్టలున్
అచ్చటిపౌరజీవితము నచ్చటికన్యలవర్తనంబు నా
కెచ్చటఁ గాన రావు మది నెట్టుల వానిని విస్మరింతునో! 5

వ. మఱియు నామె హృదయేశ్వరునిఁ దలంచుకొని యిట్లు చింతించు
చుండె. 6

శా. ఆహారంబు లభింప కాతఁ డకటా యల్లాడెనో శత్రుసం
దోహంబున్ దునుమాడి మూర్ఛిలెనొ యేదుర్యోగముం బొందెనో
యాహా! యెట్లు పురంబుఁ జేరఁగ సుఖం బౌ నాకు; నేరీతిగా
నా "హార్దో"దయ నాతనిన్ గనుచు మాటాడంగ నేనో కదా. 7

చ సురలకు భక్తి సేసితిని; సూరిజనంబుల గౌరవించితిన్;
నిరతము గీర్తిఁ గోరితిని; నేఁ దలిదండ్రుల మెప్పుఁ గాంచితిన్
ఒరులకు మేలుఁ గూర్చితిని నుత్తమకాంతల నాదరించితిన్
వరునకుఁ బాదదాసి నయి వారక సేవలు సేయు టెప్పుడో! 8

వ, అని యామె తనమనంబున ననవరతం బాలోచించునంత "సలోమి"
యామెను సమీపంబునఁ జేర్చుకొని యిట్టు లనియె. 9

ఉ. కోడల వై కుటుంబనుతిఁ గోరెదుధీమతి వై మెలంగి మీ
కూడిక కీర్తిఁ దేగఁ బతికోరిక యెప్పుడుఁ బూర్తి గాఁగ, మీ
జోడు పరస్పరంబు మనసుల్ గరఁగించెడి ప్రేమఁ గూర్పఁగా
వేడుక నాదుపుత్రకునిఁ బెండిలి యాడి సుఖింపఁ గోరెదన్. 10

వ. పరదేశంబులో సైనికోద్యోగిగ నున్నతనపుత్త్రుండు రాఁగనే
వివాహ మాడవలయు నని "సలోమి" పలుకునంత. 11

చ. పరమపవిత్రురాల। నిజబంధువులన్ గరుణించుదాన; యా
దరమును జూపుదాన; మఱి తల్లిగ నన్ గను చుండుదాన; నా
వరుసను గోరుదాన! విను; వారక చెప్పెద నేను బూర్వమే
యొరుని వరించినాను; మఱి యొప్పను బావను బెండ్లియాడఁ
గన్. 12

చ. ఒక పురుషుండు కోరగఁను నొప్పితి వానినిఁ బెండ్లియాడ; వే
ఱొకని వరింప లేను; నది యుత్తమకాంతలరీతి కాదు; కో
రిక ఫలియింప లే దనుచుఁ బ్రేముడి నాయెడ వీడ కమ్మ! నీ
విఁక నను బంపు మత్తరో! మ ఱట్టిదిచుట్టరికంబు కా దనన్. 13

ఉ. తల్లి! "సలోమి!" నన్ను గృహదాసినిఁ జేయుము సమ్మతింతు; నే
నొల్లను బెండ్లియాడ మఱియొక్కని నాతని వీడి; నిన్ను నా
తల్లిగ నెంచుకొందు; గులదైవము నీ వని పూజ సేతు; నా
వల్లభుఁ డన్న నామనసు వచ్చినయాతఁడె; నన్ను బంపుమా! 14

వ. ఇవ్విధంబున శీలమతి తనయత్తయభిలాషను సఫలంబుఁ గావింపక యతిత్వరగా నామె గృహంబు వీడె. అట సాలరా జరణ్యాము లలో నటునిటుఁ దిరుగాడుచు "మోరియ" నగరంబున కేగి యందు శీలమతి లే దని యెఱింగి తన హృదయంబులో నిటు లాలోచించునంత. 15

ఉ. స్వాగత మీయదయ్యెఁ దనసద్మమునందునఁ జేర్పదయ్యె; బా
గోగుల నడ్గదయ్యె; బ్రియగోష్ఠిని సల్పఁగఁ బూనదయ్యెఁ; దా
దాగినచోటునుండి పరితాపము నైనను దెల్పదయ్యె; నీ
లాగున మాఱిపోయె; నవలా హృదయంబున నేమి యెంచెనో!

వ. అంత నామె "లెబానోను" ప్రాంతంబునఁ దనమేనత్తయింటిలోఁ గల దని వివాహంబున కేర్పాటు లగుచున్న వనియు విని సాలరా జట కేగి యామెతో. 17

చ. చపలునిఁ జేసి బంధువులసమ్మమునందున దాగి తీవు; మం
టపమున నిల్చి పిల్చినను డాయవు కారణ మేమి? నాఁటినీ
కపటపువర్తనంబునకుఁ గారణ మిప్పుడు స్పష్టమాయె; నీ
చపలత నీతి కాదు నను సాంతము మోసము సేయ నెంచెదే! 18

వ. తనప్రియునియప్రియవాక్యంబులకుఁ బిడు గడచినట్లు శీలమతి నేలంగూలి భయవిస్మయాదులచే దీనముగాఁ బ్రియునితో నిట్టు లనియె. 19

చ. నిను వరియించి యన్నలకు నిక్కముఁ గోపముఁ గూర్చినాను; నా
మనమున నిన్ను నిల్పుకొని మామకులం బెదిరించివైచితిన్
చనవుమెయిన్ సలోమి నిజసజ్జనపుత్త్రినిఁ గోరు మన్నఁ గా
దని తగఁ జెప్పి నీవె పతి వంచు వచించితి నామె కిప్పుడే. 20

ఉ. నీవచనంబు లిట్టి వని నేఁ గల నైనఁ దలంపకుంటి నో
భూవర బేల నైతి నిను బూనికతోడ వరించి; యాత్మ నే
భూవరుపుత్త్రి నెందుఁ గొనఁ బూనితి వే నిఁ కఁ జెప్పుమా దయన్
సేవకవృత్తిఁ గొంచయిన సేవలు సేసెద నీకు భూవరా! 21

వ. అంత శీలమతి సచ్ఛీలంబునకు సాలరాజు సంతసిల్లి. 22

ఉ. నే నవివేకి నై చెలియ! నిష్ఠురవాక్యము లుచ్చరించితిన్
దీనముగాను వేడెదవు దిక్కెవ రంచును సత్యశీల నీ

లోనిపవిత్రప్రేమ నిను లోకమునందుఁ గృతార్థుఁ జేయ స
న్మానము నీకుఁ గల్గు ననుమానము లేటికి సుందరీమణీ ! 23

వ. అని తనప్రియుం డూరడిల్లఁ బలుక శీలమతి యిట్లు లనియె. 24

ఉ. నీకొఱ కేడ్చియేడ్చి యతినీరస మయ్యెను గొంతుఁ జూడు నీ
రాకకు వేచివేచి యనురాగము మించెడునాత్మ గాంచు, నీ
వాకును గోరికోరి వనవాటికలందున నిల్చెఁ గర్ణముల్
నీ కిఁకఁ దెల్పుచుంటి మది నేరము లే దని సత్యశీలుఁడా ! 25

వ. అవ్విధంబున వారిరువురు మధురసంభాషణ మొనర్చి తమతమ
యనుభవంబు లొకరి కొకరెఱిఁగించుకొని సాలపతి తనకు ప్రారం
భ్రదనివలనివిపత్తును సవిస్తారంబుగ నెఱిగించి కొలఁదికాలములో
నామెను గొనిపోయెద నని చెప్పి యరణ్యంబున కేగె నంత శీల
మతి దేవునిసాన్నిధ్యంబుఁ దలంచి యిట్లని స్తుతించె. 26

చ. మును "అయిగుప్తు,హాగరును" ముద్దులపాపను. "అబ్రహాము"వే
గను గొని పోయి వారలను గాననమందున వీడి రాఁగ రో
దనమును జేయుబాలకునిదగ్గఱ నీటినిఁ జూఱఁ జేసి వా
రినిఁ గరుణించి తోడ్పడినరీతిని మమ్మును గావు మోప్రభూ! 27

ఉ. స్త్రీలను జిన్నిపాపలను క్షేమముగాఁ గను"గాబ్రియేలు" ప
ములను దాగినావో; కను మూసితివో; పతి బాధ లొందగా
జాలినిఁ జూపు; శత్రువులసంహతినుండి విముక్తుఁ జేసి నీ
లీలల మాకుఁ జూపు; మవలీలగ దేవునిదూత! యేలుమా! 28

వ. అట్లు తన ప్రియుని క్షేమంబునకై భగవత్ప్రార్థనలు సలుపు
చుండ నామెమేనత్త యిట్లు లనియె. 29

ఉ. బంధువుఁ డైనవాఁ డునిను బాల్యమునుండియుఁ గోరువాఁడు నీ
యందముఁ జూచి పెండ్లికయి యడ్డినవాఁడు మదీయపుత్త్రికా
నందము వీడె నీవు విననందున నాతనితోఁ బెండ్లికై
యిందున నింక నుండఁ దగదిప్పుడె నీవిటనుండి పోఁదగున్ 30

వ అనుసత్త నమాటలు విని శీలమతి యాసు వెంటనె నాగ స్థానంబు
నకుఁ బ్రయాణం బై పోవ నంతఁ ద్రోవలోఁ జోరం(ద్రు)సఖులు
లా మె వాహానంబు నాపి. 31

చ. ఎవరిది వాహానంబు మఱి యెవ్వరి బాలురు మీరు రాత్రిలోఁ
దివురుచు మాఱుత్రోవలకు దీనతఁ బోవఁగఁ జోద్యమయ్యెడున్
వివరముగాఁగఁ దెల్పుఁ డొకవేళ మదాంధుఁడు సాలభూపుఁడే
భువిఁ జను చుండె నేమొ నిశిఁ బోలిక యెవ్వరుఁ గాంచ కుండఁ
గ౯ 32

వ. అట్లు సాలరాజును దిరస్కారభావంబున దూఱు నా వేగులవారిని
శీలమతి గుర్తింపక యాగ్రహంబున నిట్టు లనియె. 33

ఉ. దారినిఁ బోవువమ్ము సరిదాకుట యేల? మదాంధులార! మా
యూరికిఁ బోవుదారి యిది యూరక సాలనిపాలు లేల? ఆ
ధీనుసి సాలరాజు నవిధేయతతోడుతఁ బల్కు టొప్పునే?
చోరులుదుర్మదాంధులయి చూడఁగ లేరొకో మంచిచెడ్డల౯. 34

వ. అవ్విధంబుగ నా సాలరాజునిందకు రోషపూరిత యై వాదించు
శీలమతి కాంతనివృత్తాంతంబుఁ దెలిసియుండు నని వాగలూహించి
యా మెను జెఱఁ గొని "షాలెము" నగరంబునకుఁ బోవునంత
నాపురగరిమ యిట్లుగనన య్యె. 35

ఉ. సూర్యగభస్తి వారమునఁ జుట్టినయట్టి కిరీట మయ్యె, వై
డూర్యము లందు నిల్వఁగ విడూరముగా నది మాఱిపోయె; నా
సూర్యతనూజతేజమున శోభిలునీలలు పచ్చలుఁగా గళా
ధుర్యతగూర్పఁగా మకుటదోహలతన్ గనెనప్పురం బిలన్, 36

వ. ఆనగరంబు సముద్రమున కేబదిమైళ్ళదూరమున నెత్తయినపీఠ భూమి శిఖరంబునఁ బుట్టిన యేడుకొండలనడుమ గగనమండలము గల యున్నతసౌధంబులతో లావణ్యరాశికన్యక చిఱునగవులము ఖంబునుబోలి యానగరంబు గన్పించుచుండె. 37

తే. "ఓలివ"నగము నిల్వఁగ నొక్కదిక్కు
"ఓఫెలు"ను దూరుకొండల లిం కొక్కదిక్కు,
సొగసుగ "సియోను" మెరియలు చుట్టుకొనఁగ
"షాలెము"నగరరాజము చాల నొప్పె. 38

తే. "యొర్దనునులోయ,కిదురోను,యెహూషపాతు,
తూరుపోయను,యేలాము,తోదరాజ
హిన్న,మషిలోహ,గిహను,సిజ్కియాది,"
నీటియూటలోయలునీటుగూర్పు. 39

వ. మఱియు "జల,మూల, మత్స్య, విహంగ, మేషాశ్వర,సువర్ణకరిష, ప్రాచీన,సియోను,జఫాదు"లాదుగుమ్మములు రమ్యములై నగరంబునకు ద్వాదశద్వారంబులునై విలసిల్లుచుండె. 40

ఉ. అచ్చటిపూలరాణులకు నచ్చటియౌవనకాంత లీడు; వా
రచ్చట నుండఁ జందనము లత్తరు లేటికి? సుందరాంగులై
యచ్చున దిద్దినట్లు తగునంగము లొప్పఁగ మేనినుండి రాఁ
జొచ్చెను నాల్గుదిక్కులకు సొంపగువాసన లందు వింతగాన్. 41

తే. కోటిమన్మథు లొక చోటఁ గూడినట్లు
యువకు లప్పురినెప్పుడు నుండి రనగ
మన్మథునిరాజ్యమునకు సమంబు గాఁగ
"షాలెము"నగరముంజూడ సంబ్ర మాయె. 42

వ. అట్లు రమణీయంబగు నారాజధానిం జూచి శీలమతి యాశ్చర్య నిమగ్న యై పురవీథులం బ్రవేశించునంత నందలిపౌరులఁ దిలకించి విస్మయము నొందుతరుణంబునఁ బత్సెబరాణి తనపతియారోగ్యంబు వేడ దేవాలయంబున కేగి ప్రతిదినంబును. 43

మ. బలిహోమంబులు దానధర్మములు భూపాలుండు సేయంగఁ బూ
జల మెప్పించినరాణి దైవబలముఁ సాధించి యారోగ్యమీ
యిల స్వప్రాణవిభుఁడు గాంచుటకు భూయిష్టంబు గష్టించు; భూ
తలభారంబును రాజు మోయఁగను మోదం బయ్యె రాజ్యంబు
నఁ. 44

వ. ఇట్లుబత్సెబరాణి దేవాలయమునుండి తిరిగి వచ్చి సౌధంబునఁబ్రవేశింపఁ బోవుతఱుణంబున భటు లాశీలమతిని నడిపించుచు నామార్గంబునఁ బోవు చుండ రాణి బాలికఁ బారఁ జూచి తనవాహనంబు నాపి బాలికవృత్తాంతం బెఱింగి యామెను దనవాహనంబుపైఁ గూర్చుండ నాసతియిచ్చి దౌర్జన్యంబు చేసినభటులనుమందలించి సౌధంబున కేగునంత నాభటులు పాలీంద్రునిఁ జేరి జరిగినవృత్తాంతెల్ల నాతనికి సవిస్తారంబుగ నెఱిగింప నాతండు బత్సెబరాణితో నిట్లు లనియె. 45

చ. జనులను మోసగించి యపజాతుని రాజుగఁ జేయ నెంచి మం
తనమున రాజద్రోహులను దళ్కొని నీగృహమందుఁ జేర్చి వం

నననుతి వొచు నాకు నసచారనముఁ జేసితి నన్ను! యింక నీ
తనయుని ప్రాణము డ దని సత్యముఁ జెల్పెన నాలకింపుమా। 46

ఘటునను బార ద్రోలి యొకబందిని నీకడఁ జేరఁ దీయునీ
కుటిలపుచర్య బుద్ధికు గుర్తని వేఱుగఁ జెప్ప నేల? నా
కుటిలను రాజద్రోహపు టకున్ దగఁ బంపుము బ దిఖానలో
దిటముగఁ బట్టియుంచెద దేశద్రోహముఁ బట్టి చంపెదన్. 47

వ. అట్లు శీలమతిని చెఱఁగొనిపోవ్వటకుఁ బూనినవా రిందుగిన బాలిక
నప్పగించిక రాణి యాబాలికను దనగృహంబున నుంచి యామె
పై నారోపింపఁ బడిన నేరంబు నిశ్చయం బగునప్పటి కామె నప్ప
గింతు నని చెప్పునంత నాతండు వెడలిపోయె అబాలికను జూచిన
క్షణంబునుండి యాతలిమనంబులో మన్మథతాపంబయ్యె. ఆమె
నెట్టు లేని దనవశంబుగ సు చుకొనవ యు నని యుద్దేశించి పలు
మాఱు రాణిగృహంబున కేతెంచు చుండ. 48

క. అలనాఁడు శీలమతిఁ గని
కిలకించితిదేహుఁడ య్యెఁ గింప్రభుఁ డయ్యెన్
బలుమాఱు శీలమతితో
విలసితముగ మాటలాడ వేగిరపడెడున్. 49

వ. మఱియు నొకదివసంబున నాతండు శీలమతిఁ జూచి యిట్లు
లనియె. 50

ఉ. నిన్ను వరించితిన్ వినుము నివ్వెఱపాటున క్షోభమొందగాఁ
గన్నియ! తప్తచిత్తుడను; గాదన రాదు; మదీయరాజ్ఞి వై
సన్నుతరాజభోగములు సంతతమున్ బడయంగ మోహినీ
నన్ను నిరంతరంబును మనః ప్రభుఁగా మనమందుఁ జేర్పవే। 51

వ. అప్పుడు శీలమతి యాతనితో నిట్లు లనియె. 52

ఉ. ఓయువరాజ! బేలలయియొంటరిగన్ జరియించు కాంతలన్
డాయఁగఁ జూచెదవు కపటంబున; బాపము నీకుమూడెడున్
నీయధికార్థభోగములు నిత్యముఁ గాపురముండ బోవు;నీ
కాయము శాశ్వతంబె ? పరకాంతలఁ గోరకు రాజనందనా! 53

ఉ. అకట మారెు నాదుహృదయం బొకధీరునకున్ స్థిరంబుగాఁ;
నిం కొకమానవుండు ధర నెప్పుడు నన్ గవయంగ లేఁడు; నా
వంకకు రాకు మోకపటవర్తన చిక్కను నీకు నెన్నఁడున్
బికము లాడితేని నిటఁ బెత్తన ముండదు నీకుఁబొమ్మికన్. 54

ఉ. ఏను భువిన్ మదీయహృదయేశ్వరతుల్యునిఁ గాన లేను స
మ్మానితవర్తనుండు సహమానవులన్ గరుణించు చుండు; సం
స్థానమునేలురాజులును సాటికి రారసదప్పు గాదు; నా
లోనిపవిత్రభక్తి యనలోకిత మయ్యెడు వానిప్రేమకై. 55

వ. ఆమెకఠినవాక్యబులకుఁ గోపించి పారీంద్రుఁ డామెతో నిట్లు
లనియె. 56

తే. బాల!నీయౌవనగుణం బపారసుఖము
నిమ్ము నని గోరినాఁడను బిచ్చిదాన!
గర్వమతి వౌచుఁగాదనగాదు నీకు;
నిన్ను గొనిపోయెదను నొక్కనిముషమందె! 57

వ. అతఁడవ్విధంబుననాబాలికనుస్వాధీనపఱచుకొను ప్రయత్నంబులు
జరిపించు చుండునంత నొకభటుఁ డందుల కేగిదేశద్రోహి బంధీ
కృతుం డాయె నని యెఱింగించినంతఁ బారీంద్రుఁ డం దరిగి,

తనజనని యామెూకీజనం బపాయంబునకుఁ గురి యై రని విని యజ్ఞాతవాసముఁ జాలించి రాజధానిఁ జేరినసాలరాజునుఁ జూచి యిట్లు లనియె. ౬8

చ. రయమునఁసాలరాజుఁగనిరాణువవారునఁబట్టితేఁగని
ర్దయతపరీంద్రిరాజుతనతమ్ముఁనిఁజంపుటకుఁదలంచు,ని
ర్భయముఁగమంత్రిశేఖరుఁడురాజసభాసదులంతవేగమే
లయమొనరింపరాదనగలాఘువమొప్పఁగనుంచెబందిలో. 59

వ. అట్లుజెఱసాలలోనుండుసాలరాజును. 60

సీ. గట్టితాఁటను వానికరపాదములు గట్టి
పరిఘాదులను గొంబుఁబట్టిగొట్టఁ;
గడుదప్పిఁ గొన్నవాల్కకునీటినందించి
గుటుకలోనెనె దాని గుంజివైచి
తుద్బాధఁ బీడితుఁడోభనెక్కుడుసేయఁ
బిడికెడన్నముఁ బెట్టి వెలికిఁ దీయుఁ
గడు డస్సి పడిపోఁగఁ గాలఁదన్నుచు నిల్పి
కొఱడాలతో నీడ్చి కొట్టు చుండ

తే. స్వేదజలవర్షధారలుచెరువు గాఁగ
రక్తధారలుసరసులై రంజిలంగఁ
గ్లాంతిచే నేలఁ గూలుచుఁ గష్టపడియె
సాలపతి యిట్లు శ్రమచేత సాగుచుండె. 61

వ. అవ్విధంబున సాలరాజును హింసించు చుండ బత్సెబరాణి తన మనంబున నిట్లు తలంచె. 62

చ. పరిణయ మాడునాఁడు నరపాలుఁడు చైత్రుఁడు, యూవపెద్ద
లున్
గురు వగు "నాతసుండు" సమకూడిననాఁడు వచించె వారితోన్
"ఉరియను" జంపితేఁగనిది యుత్తమురా లపరాధి కాదు నా
గురుతరరాజ్య మిచ్చెదను గోమలిపుత్త్రిన కంచుఁ బల్కఁగాఁ. 63

వ. అని పూర్వమున రాజు చేసినప్రమాణంబును దలంమకొని యా వాగ్దానంబు నాతనికి జ్ఞాపకమునకుఁ దే వలయు నని కోం యిట్లు తలంచె. 64

చ. ప్రభుఁ డొకవేళఁ బూర్వమునఁ బల్కినమాటను విస్మరించెనో
విభుఁ డొకవేళ రాజుగను వేఱొకనిన్ నియమింపఁ గోరెనో
యభినుతిఁ జేసి రాజు నిఁక నగ్గెదరాజ్యము సాలరాజుకై
ప్రభుఁ డెటులైన బాలకుని ప్రాణముఁ గాచును మేలు గల్గెడున్.

వ. అప్పు డామె వ్యాధిగ్రస్తుం డైనరాజుం జేరి యాతనికి సాష్టాంగ నమస్కారం బొనరించి పూర్వము పరిణయమప్పు డాతఁ డొనర్చినవాగ్దాన మాతనిజ్ఞాపకమునకుఁ దేఁగఁ జైత్రుఁడ ద్దాని కియ్యకొని యామెతో నిటు లనియె 66

ఉ నీతనయుండు రాజ్యమును నిక్కముఁ బొందును సారసాక్షి! యే
జ్ఞాతులు, : ప రొకనాఁటికి నైనను సాలభూపతిన్
నాతరువాత రాజ్యమును నద్దెసలందునఁ బెంచి కీర్తితో
భూతల మెల్ల నేలి యతిపుణ్యుఁడ టంచుఁ బొగడ్త లొందెడున్.

వ. అప్పుడు. 68

ఆ. వె. పాపభీతి యించక పారింద్రుఁడెల్లరఁ
జెఱను బెట్టి గొట్టి చీల్చుచుండ
సాలరాజు రాఁగఁ జంపెద నని పోవ
మంత్రు లంత వాని మనిచి రెలమి. 69

వ. అవ్విధంబునఁ గొడుకు చెఱలో బాధపడుచున్నాఁడని బత్సైజ రాణి మొఱపెట్టఁగా రాజు పారీంద్రుని దౌర్జన్యంబు నెఱింగి "సచ్చునాది" ప్రముఖమంత్రులం బిలిపించి వారితో నిట్లనియె

ఉ. పంతముతోఁ బరీంద్రుడిఁక నఁ బట్టముఁ గట్టుకొనంగఁ బూని నా
చెంతను జేరఁ డాయె నభిషేచముకై తనుగోరుచు డె న
త్యంత సుఖంబులొందెఁ దనతమ్ముని జంపఁగ యత్నమూనెః నీ
హంతకునిఁ త్యజించితిని నభ్యుదయం బగు సాలరాజు చేః 71

వ. మఱియు నైంద్రుండా మంత్రులం గాంచి. 72

ఉ. చేరి "గిహాను" నందు నభిషేకము సేసి రథంబుపైని శృం
గారము సేసి దానిపయి గద్దియఁ బెట్టి కనిష్ఠుఁ డెక్కఁగా
ధీరుఁడు సాలరాజు మనదేశము నేలువిభుం డటంచు మీ
భూరి నినాదముల్ సలిపి పుత్త్రుని దెచ్చి మీకు మేలగన్. 73

వ. రాజ్ఞాను రథంబును శృంగారించి యద్దానిముందర జనులు సమూహంబులై "సాలరాజు చిరంజీవి యగు గాక" యని నినాదములు సలుపుచుండి రంత. 74

అప్పుడు జెట్టిసుల్లును [illegible] రాష్ట్రున్
నిప్పులు గ్రక్కువాలు మఱినిక్కెడు డాలును గొన్ని యూతలున్

ఒప్పంగ నశ్వసైనికుల నుద్ధతకుంజరసైనికావ్రగణుల్
గొప్పగ నప్పురంబుఁ జని కోటను జుట్టిరి బొబ్బరిల్లుచున్. 75

క. రణభేరి తూర్యారావము
క్షణమున నల్దెసలయందుఁ గదలుకొనంగన్
రణభూమి నిండిపోయెను
గుణరావము మీఱ వీరకోటులుబలిమిన్. 76

క. కారాగృహపాలకు లటుఁ
బోరాడిరి పటు విడక పోటాపోటిన్
వారేమి పలుక కుండిరి
కారాద్వారములఁ బట్టి గట్టిగఁ దెరవన్. 77

క. జయనాదమ్మున శూరులు
నయముగ నాసాలరాజునకు సాష్టాంగం
బగయంగఁ జేసిరి తదుపరి
రయముగ రమ్మనిరి తండ్రి రాజ్యం బేలన్. 78

వ. అ ట్లెటిగించి కారాగృహాంబునుండి యాతని విముక్తినిఁ గావించి పట్టాభిషేకంబునకుఁ గొని పోవునంతఁ బారీంద్రుఁడు తనమిత్రులతో విందుశాలలో నిట్లు సంతసించుచుండెను 79

ఉ. విందువిలాసకేళులను వింతవినోదములందు హాయిగా
నందఱు మత్తులై వనితయద్భుతనాట్యకళావిశేషమం
దందముఁ గుల్కు చుండుసభయందలితియ్యనిగానమందునన్
మందుగ గాంగ యుద్ధమును మార్కొని వచ్చెను సాలసైన్యముల్. 80

వ. సేనాని యుద్ధంబునకు సిద్ధం బయ్యె. పారీంద్రుఁ డప్పుడు వెలవెలఁ
బోయి యుద్ధంబునకుఁ గారణం బరయఁ జాలఁ డయ్యె. 81

ఉ. వ్యూఢము లై సమీపమునఁ బూర్ణరణంబునకై ముఖాముఖీ
గాఢముగాను గూడినజిఘాంసువు సేసవిజృంభణంబులున్
రీఢ, నిగాఢ,దూషణపరీతము చేతము గాఁగ నంతటన్
ఔఢ గలీను లై సమరచోదకు లై మునుముందు సాగఁగా. 82

ఉ. ఒక్కట బాణయుద్ధమును నొక్కట మల్లమహాసమీక మిం
కొక్కట భిందిపాలమృథ మొక్కటఁ గుంతసమిత్తుధాటి వే
ఱొక్కట నశ్వసంఘరణ మొక్కట హస్తిబలంబు పోరఁగాఁ
గ్రిక్కిన యుద్ధభూమి కడుకంపిత మై కనిపించె నంతటన్. 83

వ. ఇరువైపులును సైనికులు ధైర్యశౌర్యప్రతాపంబులతో హోరా
హోరినిఁ బోరాడుచుండ యాజకుఁడు చక్రవర్తియాజ్ఞానుసారం
బుగ సాలపతిని నభిషిక్తుం జేయఁ బౌరు లందఱును గుంపులుగుం
పులుగా సాలపతి వాహనంబుముందర "సాలరాజు చిరంజీవి
యగుఁ గాక" యని జై వెట్టఁ బారీంద్రునిసైనికులు తదవసరంబున
యుద్ధంబునకు సాగునంతలోఁ బారీంద్రుఁడు సైన్యంబులతో
వారినిఁ గలిసకొని ఘోర యుద్ధంబు సేసె. 84

క. ఇది నాల్గవయాశ్వాసము
ముదమున రసికాగ్రణులకు మున్నిడి దీనన్
సదసత్తులు దెల్పఁగ నా
సదయుల వేఁడెదను విజ్ఞసంఘము మెచ్చన్. 85

---

# శీలమతీపరిణయము



## పంచమాశ్వాసము

వ. యుద్ధంబునకుఁ బూర్వము బత్సెబరాణి తనకుమారుని ప్రాణము
లను గాపాడుటకై మంత్రులతోఁ గలిసి చైత్రప్రభుసన్నిధి కేగెను.
పారిందు్రిఁ డాసమాచారము గూఢచారులమూలమున నెఱిఁగి
శీలమతినిఁ బట్టి తెప్పించుట కేర్పాటులు సేసె. రాణిసౌధంబున
నుండు సద్భీచి యొకతె యారహస్య మెఱింగి శీలమతి కావిష
యంబుఁ దెలిపి యుపాయంబునుండి తప్పించుకొనెడునుపాయం
బును బోధించెను. తదవసరంబున శీలమతియు నాగృహంబు తన
ప్రియునిజనని దని గుర్తించియు సందుండిన నపాయంబునకుఁ
గారణ మగు నని యెఱింగి వేఱొకస్థలంబున కేగెను. ఆమె తన
రహస్యంబును బత్సెబరాణి కెఱిగించుటకు సాహసింప దాయెను.
ఆమెప్రియుం డెం దున్నాఁడో యావిషయం బామెకుఁ దెలియ
దాయెను. అయ్యవసరంబున నామె నగరకన్యకలను జూచి
వారితో నిటు లనియె. 1

ఉ. మీనవవక్త్రమండలము మీటఁగ నుజ్జ్వలచంద్రకాంతులున్
మీనవసంహతస్తనసమీకృతవర్తులబిల్వతోరణం
బై,నిగ లాడుచూడ్కులును భాసురసూర్యతనూజధారలై
యూనవభూమి కీయఁగన దెంతవిలాసము మీనివాసముల్. 2

ఉ. నన్ను వరించినట్టిధరనాథసుతుండు మనీషి ధృష్టుఁడున్
సమ్మతసత్యవాది మును సారెకు గోస్తనివల్లిఁ జేరి నా

మన్ననఁ బొందిది యాతఁడభిమానము నాకును జూపినాఁడు, మీ
కన్నులఁ జొచ్చి యున్నప్రియు కాంతునిఁ జూపరె మీకు పుణ్య
మౌ. 3

వ. ఆపుర కామినులా మె వాక్యంబుల కాశ్చర్యంబు నొంది. 4

ఉ. చక్కని దాన! నీవెవరు? షాలెమురాజపురంబుదీ ప్తిపెం
పెక్కువ సేయు దాన; నిను నెవ్వఁడు వంచనఁ జేసె దెల్పుమా
యెక్కడివాఁడు వాని దగునేమివిశేషము చెప్పవే సఖీ!
యిక్కడఁధీరవీరతతి నెవ్విధి మించును వాఁడు బాలరో! 5

వ శీలమతి తన ప్రియునిఁగూర్చి పుర కాంతలకు నిట్లు వచియించె. 6

తే. ధవళవర్ణుఁడు రత్నాలు దాపినట్టి
దేహమా యిది యను నట్లు తేజరిల్లు
వేలవేల్జనము లసమావేశమందు
నతని గుర్తింపఁగా వచ్చు నమ్మలార. 7

తే. విభుని తారుణ్యలావణ్యవిలసనములు
వలపుజవరాండ్రకలపుల వాస మనఁగ
మధురదృక్కుల నేత్రింపుమంజిమంబు
క్షుబ్ధహృదయాంగనాతతిశోభ యనఁగ

వ. వక్త్రమండలరుచి తగ్గిన దైహృదయవిరహావేదన విస్ఫుటం బగు
నంత కీరశారికాదులలలితగానంబుల వారించి, కేకీనినాదంబులనేవ
గించి, మధుశీరఝుంకారంబుల నసహ్యంకొని,చంచలాకులితహృదయ
యై శీలమతి యుద్యానవనమందలిపక్షులతో నిట్టు లనియె. 9

తే. రావె రాయంచ! నీపంచ రాఁగ నతని
దాచి యీరీతి మౌని వై దాగినావె?
ముద్దుచిలుకమ్మ! నీయొద్ద ముచ్చటాడఁ
బ్రియుఁడు వచ్చినఁ దెల్పుమా బిడియ మేల? 10

వ. ఇవ్విధంబునఁ దనప్రియుని వెదకుచు నాతనిఁ గనక శీలమతి యొక రహస్యస్థలంబున దాగి విలపించు చుండెను. పారీంద్రుఁడు సైన్యములతో సాలపతిని యుద్ధభూమి నెదిరింప రెండుపక్షంబుల సైన్యంబులుఁ బోరాడు చుండునంత. 11

చ. అసదృశలీల సాలపతి యప్పుడు మార్కొని శత్రుసేనఁ దా
నసియసితాగ్రకాంతిపతి నంధులఁ జేయుచు సైనికాళి వే
విసరిరి వారిఖడ్గముల; స్వీయభటావళి యెట్లు పోరిలో
నసి చెడి పారి పోయి; రిటు సాలుని శౌర్యముఁ జెప్ప శక్యమే. 12

చ. తనభుజశక్తితో నెదురు తాకి జయించుచు సాలరాజు, దూ
రెను రణభూమిమధ్య రిపుపృథ్వీపతిన్ బరిమార్చ; వానిరా
కను గని పారి పోయె నతికంపము నొందుచు; వానిసైనికుల్
వినుతి నణంగి రానృపతివీర్యము స్తోత్రము సేయు చాత్మలో! 13

వ. సూర్యుఁ డస్తమించునప్పటికి "గిహాను" గుహా సమీపంబున వ్యూఢం బైన నిస్త్రార సైన్యంబు ఘోరంబుగఁ బోరాడి దారుణ మరణ మొందఁగ రాసు లై పడి యుండిన మానవశవములును, కొండలవలె నేలం గూలినచండవేదండకోటియును, శరీరంబునుండి వేఱైనశిరఃకరపాదోదరంబులును, పారు చున్నరక్తంబును; చక్రంబులు వేఱై పడి యున్నరథంబులును, గాయంబులచేఁ గదలక

పడి యుండినఘోటకోష్ట్రితతియును యుద్ధభూమిలో నగుపడు
చుండెను. 14

క. భయకంపితవారీంద్రుఁడు
రయమునఁ బరుఁగెత్త యుద్ధరంగము వొంగన్
లయ మొందఁగఁ దనసైన్యము
వియుక్తుఁడుగ నయ్యె రాజవిభవముఁ దొలఁగన్! 15

వ. తదవసరంబున నాతం డిట్లాలోచించు చుండె. 16

క. నగరంబున కిపు డరిగిన
మగువలఁ జెఱఁ బట్టి శీలమతి నటఁ బొందన్
దగుసమయం బని తా సం
యుగమును గణియింప కుండ నూరున్ జేరెన్। 17

వ. యుద్ధభూమినుండి పలాయితుఁడై రాజమాత రాణి 'బత్సెబ'
సౌధంబుఁ జొచ్చి. 18

క. చెలికత్తెలఁ జెఱఁ బట్టఁగ
విలపించిరి రాజమాత విలవిలఁ బోవన్
బలునగలు ధనము మఱి కాం
తలఁ గొని పోవంగఁ దలఁచెఁ దంత్రజ్ఞుండై। 19

క. అంతట వినయుఁడు వచ్చుటఁ
గుంతంబును జేతఁ బట్టి కోపము మీఱన్
వింతగఁ గరవాలముతో
గొంతుక తెగ వేయ నతఁడు గూలెన్ నేలన్? 20

వ. పారీంద్రునికంఠంబు దేహంబునుండి దూరంబు గాఁగ నేల గిరగిరఁ
దిరిగి శవంబు రక్తధారలను జిమ్ముచుండ రాజమాతయుఁ జెలి
కత్తెలు నది సహించ లేక తమతమస్థానంబుల కేఁగునంత. 21

క. నెచ్చెలిపరిచారిక సని
చచ్చెను బారీంద్రుఁ డనుచు సరగునఁ దెలుపన్
మెచ్చెను శీలయు మనమున
నొచ్చుచుఁ దనప్రియునిఁ గనక న్యూనతఁ జెందెన్. 22

చ. బహుదినముల్ గతించినను బాలికకున్ బ్రియుఁ డందఁ డాయె, దాఁ
దహతహ లాడుచుండెఁ దనతల్లిని నన్నలనున్ దలంచుచున్
గహనములందుఁ బోయి తన కాలముఁ గడ్పుటకై తలంచి, తా
విహగముఁ బోలె నొంటరిగ వెల్వెలఁ బాఱెను దిక్కు లేనిదై.

వ. పారీంద్రుని రణమందు జయ మొనర్చి రాజ్యంబును జేపట్టినను
సాలరాజు మనోవేదనతో దినములు గడపుచుండెను అతనిమనః
ఖేదంబునకుఁ గారణంబు లెవ్వ రూహింప లేరైరి. శీలమతికై
షూనేమియనగరంబునకును లెబానోనుసీమకును రహస్యముగఁ
దనదాసులఁ బంపి యామె యానగరములయందు లేదని యెఱింగి
మిక్కిలి దుఃఖించెను. శీలమతిచెల్లెలిని బంధువర్గంబును బిలిపించి
తనప్రియురాలొకదివసంబునకు వారినిమిత్తమై రాఁగలదని
తలంచి తనసేవకులఁ బంపి షాద్మతిని బంధువర్గంబును రప్పించి
వారికిఁ దగినమన్ననలు సలుపుటకు దాసీదాసులను నియమించెను.
తదవసరంబున మంత్రులు రాజధాని నలంకరించిరి. యువరాజు

పట్టాభిషేకమహోత్సవములోఁ బాల్గొనుట కుద్యోగులును గ్రామ
జనులును గుంపులు గుంపులుగ వచ్చి నగరమం దుండునంత. 24

చ. పురము నలంకరించి రటఁ బూర్వము పౌరులు సూడనట్టి స
న్మరకతతోరణంబులును మంటపముల్ మినుదాఁకు తెక్కెముల్
గురుతరసౌధభాగములు గోపురముల్ సభ మంటు చుండఁగా
నిరతము మందహాసమున నీటుగ నప్పురిఁ దోఁచె నంతటన్. 25

చ. వేదికఁ గట్టినారు; పదివేలజనంబులు వచ్చినారు; శా
స్త్రాదులు విప్పినారు; విబుధావళి కార్యముహూర్తకర్తలున్
వేదము దీసినారు; సమవేతసుపండితమండలంబులున్
బ్రోది కవీంద్రులున్ జదువ భూపతి గద్దియ నెక్కె నీటుగా. 26

వ. తదవసరంబున మతాచార్యుండును దక్కినగురువులు వేదిక నలంక
రించినసాలరాజును జేరి. 27

ఉ. దీపితరత్నహారములు దివ్యకిరీటము మేలిరత్నముల్
దాపినభూషణాళులు శతంబులు బంగరురాజదండముల్
భూపతి కీయఁగాఁ దలఁచి పూజ్యులు భక్తినిఁ దేఁగ యాజకుల్
ఏపుగ నీయలంకృతుల నేలికకున్ ధరియింపఁ జేయఁగాన్. 28

వ. అంతట జనసమూహములు. 29

ఉ. గంతులు వేసినారు; పురకాంతలు పుష్పసుగంధలాజలన్
సంతతవర్షధారలుగఁ జల్లుచు మంగళహార తీయఁగా
సంతసనాదముల్ సెలఁగె; సర్వవిభుండగు సృష్టికర్త శ్రీ
మంతుని రాజపుంగవుని మానుగఁ గాపుత మంచు వేఁడఁగన్. 30

వ. అట్లు సింహాసనాసీనునిఁ గావించి కిరీట మొఁదల ధరింపఁ జేసి పట్టపు
ఏనుఁగుపై నాసీనునిఁ గావించి పురవీధులఁ బోవ నంత. 31

క. పురవీధుల కిరువైపుల
నరసంహతి చేరి ఘననినాదముఁ జేయన్
ధరనాథుఁడు చిఱునగవులఁ
బురవీధులఁ దిరిగె ననఁగ బోరున మ్రోగెన్. 32

వ. రాజనగరంబును వీడియరణ్యముఁ జొచ్చి నిరంతరంబేకాంతముగా
నివసింపఁ దలఁచిన శీలమతి పురం బలంకరింప బడుటఁ జూచి యా
యలంకారంబునకుఁ గారణం బెఱింగి పట్టాభిషేకమహోత్సవ
మును జూచి పోవలయు నని శీలమతియుఁ దనప్రయాణం బాపి
యాదివసంబున వేడుకను గాంచుటకుఁ దనరహస్యస్థానంబు వీడి
రాజవీధిలో జనసమూహముమధ్య నిలుచుండి యేనుఁగుపై
నాసీనుఁడైనవాఁడు తనప్రియుం డని గుర్తించి ముదుక
కేతెంచి తీవ్రముగ నాతనివైపు తిలకించుచు నిట్లు తన మనంబునఁ
దలపోయుచుండె. 33

ఉ. తేనియ లొల్కుమాటలను దేపకుఁ దేపకుఁ జెప్పి తోఁటలో
మానవతీ! భయంపడకు మానక నిన్ను వివాహ మాడెదన్
గాని వినంగ రా దొరులు; గష్టవిపత్తులు గల్గు నన్నయా
మానవుఁడే పరిత్యజించు దయ మాలినవాఁ డెటుఁ బోదుదైవమా.

ఉ. వాంఛలఁ జూపి నన్ను వనవాటికలందునఁ బిల్చి పిల్చి ప్రే
మించినతోయజాక్షిని గమించినవాఁడ వటంచుఁ బల్కఁగా
మంచితనంబుతో దరికి మమ్ము జేర్చునో లేక తాను గో
పించి దయావిహీనుఁ డయి వెళ్లు మటన్నను దిక్కు లే దికన్.

వ. ఇవ్విధంబునఁ దనప్రియునిఁగూర్చి మనంబులో నన్యథా తలంచినసం
దులకు వగచి యది తనయవివేకం బని గుర్తెఱింగి యిట్లు లనియె.

క. పట్టాభిషేకమప్పుడు
పట్టపుదేవిగను నన్ను బరిపాలింపన్
గట్టిగఁ గొనిపోలే దని
తిట్టుట ధర్మంబె ప్రియుని దెలియ నొకింతన్. 37

వ. మఱియుఁ దనప్రియునిఁగూర్చి తనయిష్టదేవునిఁ బ్రార్థించునంత.

క. జననాథుఁడు తనదయితను
మనమున ననుకొనుచు నచటిమగువల నెల్లన్
గను లెత్తి పాఱఁ జూడఁగఁ
గనిపించెను గాంత యొకతె కన్నీ రొలుకన్. 39

వ. ఆసమయంబున. 40

క. ప్రమదము మీఱఁగ నాతఁడు
కుముదాంగినిఁ జూడఁ గోరి కుంజరమును వే
గముగను నాఁచెసఁ దోలఁగఁ
గమలదళేక్షణయు నతనికంటన్ బడఁగన్. 41

ఉ. డిగ్గున వాహనంబు దిగి దీనముగా నిలుచుండఁ బ్రేమతో
దగ్గఱ కేగి శీలమతి! దాగితి వెందున నిన్నినాళు;లో
సిగ్గరి! చెప్ప వేల? నిను జేరఁగ నామది మోద మొందెఁగా;
దగ్గు ట దేల? వాహనముఁ దప్పక యెక్కుము నీవు రాణివై!

వ. ఆపలుకు లాలించి శీలమతి. 4

వ. ఇవ్విధంబునఁ దనప్రియునిఁగూర్చి మనంబులో నన్యథా తలంచినం
దులకు వగచి యది తనయవివేకం బని గుర్తెఱింగి యిట్లు లనియె.

క. పట్టాభిషేకమప్పుడు
పట్టపుదేవిగను నన్ను బరిపాలింపన్
గట్టిగఁ గొనిపోలే దని
తిట్టుట ధర్మంబె ప్రియుని దెలియ నొకింతన్. 37

వ. మఱియుఁ దనప్రియునిఁగూర్చి తనయిష్టదేవునిఁ బ్రార్థించునంత.

క. జననాథుఁడు తనదయితను
మనమున ననుకొనుచు నచటిమగువల నెల్లన్
గను లెత్తి పాఱఁ జూడఁగఁ
గనిపించెను గాంత యొకతి కన్నీ రొలుకన్. 39

వ. ఆసమయంబున. 40

క. ప్రమదము మీఱఁగ నాతఁడు
కుముదాంగినిఁ జూడఁ గోరి కుంజరమును వే
గముగను నాపెసఁ దోలఁగఁ
గమలదళేక్షణయు నతనికంటన్ బడఁగన్. 41

ఉ. దిగ్గున వాహనంబు దిగి దీనముగా నిలుచుండఁ బ్రేమతో
దగ్గఱ కేగి శీలమతి! దాగితి వెందున నిన్నినాళ్లలో
సిగ్గరి! చెప్ప వేల? నిను జేరఁగ నామది మోద మొందెఁగాఁ
దగ్గుట దేల? వాహనముఁ దప్పక యెక్కుము నీవు రాణివై।

వ. ఆపలుకు లాలించి శీలమతి. 4

ఉ. ఎంతటిదాన నేను ధరణీశ్వర! నా దగువంశ మెంత, రూ
పెంత, విలాస మెంత, బ్రిదు కెంత తలంప నిజాప్తు లెంత, నీ
చెంతకుఁ జేరునంతటివిశేషము లెవ్వియు లేవు పొమ్ము శ్రీ
మంతుఁడ! రాజకన్యకలమైత్రినిఁ గోరుము నీకు మే లగున్. 44

వ. మందహాసముతో సాలరాజు. 45

చ. ధరపతు లాడుమాటలను దప్పరు భూమి గతించినన్ భువిన్
దొరతన మంతరించినను దుర్మరణం బట సంభవించినన్
బురవనమందు నిన్ను గని ముచ్చటఁ బల్కినవాఁటివాక్యముల్
స్థిరపడు దైవచిత్త మిది చింతను మానుము నాకు రాణి వై! 46

వ. అంతట శీలమతి. 47

ఉ నల్లని దాన నైతి నని నవ్వుదు రెందున లోకపాలకా!
గొల్లది రాణి యై తమరిగొప్పతనంబును డిగ్గఁ జేయఁగా
నొల్లరు లోకు లెల్ల నది యొప్పిద మెట్టులు? సత్యశీలుఁడా
మల్లడి యేల? రాజ! ననుమాత్రము వీడుము నీకు మే లగున్.

ఉ. దాసిగ నీపదాబ్జములదాపున నుండెదఁ గాని నీకు నేఁ
దీసినదాన నన్ను గుణదీపిత! యాశ్రితపాల! వీడుమా;
నీసరిదాని రాణిగను నిక్కముఁ బొందుము దీనపాలకా!
నీసముఖంబునందు నను నిత్యము నిల్వఁగ నాన తీయవే! 49

వ. ఆమెదీనాలాపంబుల కెంతయు సంతసించి రాజా మెతో నిట్టు
లనియె.

ఉ. ప్రేమవిలాసినీ! వినుము పేదటికంబును జూడ రాదు;నీ
ప్రేమధనంబు గాదె నను బెక్కువిధంబుల గారవింపఁగా
నే మని చెప్పువాఁడ మును నేదెస గానక గానసంబులో
భామినిః సంచరింపఁగను భక్తినిఁ గావఁగ భార్య వీవె కా! 51

వ. ఇట్లనేకవిధంబుల నామె నోదార్చి గజవాహనంబుపైఁ దన ప్రక్క
నాసీనురాలిం గావించి పురవిహారంబుఁ జేయు చుండ నగరవాసు
లెల్లరు నాశ్చర్యం బొంది యావింత నెఱుంగ లేక విభ్రాంతు లగు
చుండునంత. 52

చ. గగనమునుండి జారి పడుకాంతిమయం బగుతారచంద మై
మగువ గజంబు నెక్కి పురమార్గములందున సంచరింపఁగాఁ
నెగడిగఁ జూచి పౌరు లిపె యెవ్వరిపుత్త్రిక రాజధానిలో
నగువడ లేదు; రాజు నొకయప్సర కోరిన దంచుఁ బల్కఁగాన్. 53

వ. తదవసరంబున దత్సెబరాణి. 54

చ. మునమున నన్నుఁ జేరి కడు ముచ్చటగా విహరించు బాలికన్
మదమతి పౌరరాజు గని మాటికి మాటికిఁ బొందు గోర నా
సదనమునుండి దూర మయి సద్గుణశీల మదీయబాల నా
పదలను నోర్చి శీలమతి బంధువురాలు మతాబుకోడ లై! 55

వ. గజవాహనముమీఁద విహరించునది తనయక్క యని పాద్మతి
గుర్తించి. 56

క. అటఁ గనిపించెడుకాంతను
దిటముగ గుర్తించె శీలదేవి య టంచున్
ఇట నే నక్కను జూచుట
చటులం బగుస్వప్న మంచు పాద్మతి దలఁచెన్. 57

వ. అవ్విధంబున రాజమాత బత్సెబ చెల్లెలు పాద్మతియున్ సోదరులున్ జననియున్ శీలమతిని గుర్తించిగజవాహనంబును సమీపించి యా బాలికను గొనియాడ బత్సెబరాణి యామెను దనసౌధంబునకుఁ గొనిపోవునంతఁ బ్రధానమంత్రి సాలరాజునకు శీలమతికిన్ మఱు నాఁడు వివాహం బని ప్రకటించునంత పౌరు లుల్లసించిరి వివాహ మహోత్సవంబునకుఁ దగునేర్పాటులుఁ గావింపఁ బడెను. 58

చ. పురము నలంకరించి తగఁ బూసిరి కుడ్యము లెల్ల కాంతలున్
నరపతి పెండ్లినాఁడు జయనాదము మింటికి నంటఁ జేయఁగా
గురుతరభక్తిఁ జూపి యనుగుణ్యముగా మెలఁగంగఁ బౌరులున్
బరిణయ మాయె వింతగను బక్షిమృగాదులు సంతసింపఁగా. 59

వ. వివాహవేదికఁ జేరునంత. 60

చ. వధువు సవాంబరంబులను వజ్రకిరీటము రత్నహారముల్
అధికముగాను దొడ్గిభవికాంగన మెల్లఁగ ముందుముందుకున్
అధిరితవస్త్రభూమిపయి నడ్గులు వేయుచు వచ్చుచుండె నా
యధిపుఁడు సన్నిధానమును నందుకొనంగను మందిరంబునన్. 61

వ అట్లాసౌభాగ్యభాగ్యాభిజాత బంగారుసరిగపావడ గట్టి చీనిచీనాం బరములు సుట్టి పారిజాతకుసుమపరిమళంబుల నలరి చేమంతి, సం పెంగ, సన్నజాజులఁ జేతఁ గొని బహుళాభరణధారిణి యయి నిజ ప్రాణవల్లభునిఁ జేరినంత. 62

ఉ. అప్పుడు సాలరాజునకు నాతఁడు కోరినశీలమాంబకున్
ఒప్పుగ యూదవేదవిధియుక్తవివాహముఁ జేయఁ బౌరులున్

గుప్పరి పుష్పలాజములు గూరిమి నూతనరాజదంపతుల్
గొప్పగ హర్ష మొందఁగను గోటిజనంబులు సంతసింపఁగన్. 6[illegible]

వ. వివాహం బగునంత రాజదంపతులును రాజమాత బత్సెబరాణిప దంబుల వ్రాలి నామెయు వారలను "దీర్ఘాయురస్తు, పుత్ర పౌత్రాభివృద్ధిరస్తు" అని యాశీర్వదించెను. అంతట శీలమతి తల్లి[illegible] భక్తి సలిపి, యన్నలయాశీర్వాదము లొంది, చెల్లెలికి శుభ మొసఁగి బంధువులను బలుకరించి, నిజవల్లభునినూతన గృహంబు ప్రవే శించెను. 6[illegible]

క ఈప్రపంచమభాగమునం
దాపరితోపముగఁ గన్నియకు పొలునకున్
వే పరిణయ మయ్యెను సం
దీపితదాంపత్య మనుచు దివి భువి మెచ్చన్. 6[illegible]